శ్రీరస్తు.

# కవిరాక్షసీయము

ద్వ్యర్థికావ్యము.

ఆంధ్రటీకాతాత్పర్యవ్యాఖ్యానసహితము.





చెన్నపురి:

వావిళ్ల, రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారిచే:

ప్రకటితము.

1926.

శ్రీరస్తు.

# కవిరాక్షసీయము

## ద్వ్యర్థికావ్యము.

ఆంధ్రటీకాతాత్పర్యవ్యాఖ్యానసహితము,





చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్‌సన్స్‌వారిచేః

ప్రకటితము.

1926.

# పీఠిక.

---

ఈకవిరాక్షసీయమను ద్వ్యర్థికావ్యమునందు ప్రాయికముగా నుపమాలంకార శ్లేషాలంకారములే నిండియున్నవి. ప్రథమశ్లోకమున నుపమేయోపమాత్వము సిద్ధించెను. అద్దానిని కువలయానందమున నుపమాప్రకరణమం దుదహరించి యుండుటంబట్టి యారీతి కావ్యసమయమునకు భయమగునో యని వదలినాఁడ. అయినను, కొన్ని శ్లోకముల కావిధమైన టీకయే వ్రాయఁబడియున్నది. సంస్కృత కావ్యములందలి యన్వయ మాంధ్రటీకలం దొకానొకచో సమంజసముగా తోఁపదు. అట్టిశ్లోకము లనేకము లీకావ్యమందుఁ గలవు. అచ్చో నాయపరాధంబు క్షమింపవలయు నని కోరెద. ఈకవికి కవిరాక్షసుండని పేరు గలుగుటకు, "సాక్షరేషు భవతీహ జగత్యాం సర్వఏవ హృది మత్సరయుక్తః, సాక్షరం కవిజనేషు య దేనం లోక ఏష కవిరాక్షస మాహ" అనుశ్లోకమును వక్కాణింతురు. ఇచ్చో నాయభిప్రాయం బీగ్రంథావసానమునందుఁ దెలిపినాఁడను. ఇందేదేని దోషములుండునేని పండితులు సవరించి క్షమించెదరని ప్రార్థించెద.

గుడిబండ
1-12-1916.

ఇట్లు,
శ్రీనివాసపురము లోకనాథకవి.

శ్రీ ర స్తు.

# క వి రా క్ష సీ య ము

## ఆంధ్రటీకాతాత్పర్యవ్యాఖ్యానసహితము.

---

అవ. కవి స్వాహంకారమును పరిహరించువాఁడై చెప్పుచు న్నాఁడు:—

శ్లో. గుణదోషౌ బుధోగృహ్ణ న్నిన్దుక్ష్వేళావివేశ్వరః,
శిరసా శ్లాఘతే పూర్వం పరం కణ్ఠే నియచ్ఛతి. ౧

ప్రణమ్య లోకనాథోఽహం పార్వతీప్రాణవల్లభమ్,
టీకాం మాన్ధాత్రికాం కుర్వే కవిరాక్షస సత్కృతేః.

వ్యా.—కవి స్స్వౌద్ధత్యం పరిజిహీర్షు రాహ-గుణదోషావితి. బుధ్యత ఇతి బుధ విద్వాన్, గుణః శ్లేషప్రసాదాదిః, దోషః అసాధ్వశ్లీలాప్రయుక్తాదిః, క్రూరకృత్యం తౌ వుభౌ గృహ్ణ న్సన్ పరిగృహీతవాన్ పూర్వం గుణం శిరసా శ్లాఘతే, శిరఃకంపన పూర్వం స్తౌతీ త్యర్థః. పరం దోషం, కంఠే గళే, నియచ్ఛతి స్థాపయతి న వక్తీ త్యర్థః. ఈశ్వరః శివః, ఇందుక్ష్వేళౌ శశివిషే ఇవ సోఽపి చంద్రమసం శిరసా ధత్తే. విషంతు కంఠే ధృతవాన్ తథా మత్కావ్యస్థా న్గుణా న్గృహ్ణంతు దోషా న్న గృహ్ణంతు త్వితి కవి ర్విపశ్చితః ప్రార్థితవా నిత్యనుసంధేయమ్.

టీక. బుధః = పండితుఁడు, గుణదోషౌ = గుణదోషములరెంటిని, ఈశ్వరః = పరమేశ్వరుఁడు, ఇన్దుక్ష్వేళావివ = చంద్రవిషములనువలెనే, గృహ్ణన్ = గ్రహియించినవాఁడై, పూర్వం = మొదటిదియగు గుణమును, శిరసా = తలచేత, శ్లాఘతే = కొనియాడుచున్నాఁడు. పరం = వెనుకటిదియగు దోషమును, కణ్ఠే = కుత్తుకయందే, నియచ్ఛతి=నిలుపుచున్నాఁడు.

అర్థాంతరము. ఈశ్వరః = పరమేశ్వరుఁడు, ఇన్దుక్ష్వేళౌ = చంద్రుని విషము ను, బుధః = విద్వాంసుఁడు, గుణదోషావివ = గుణదోషములనువలె, గృహ్ణన్ = తీసి కొనినవాఁడై, పూర్వం = మొదటివాఁడగుచంద్రుని, శిరసా = శీర్షముచేత, శ్లాఘతే = కొనియాడుచున్నాఁడు. పరం = వెనుకటిదియగు దోషమును, కణ్ఠే = గొంతునందు, నియచ్ఛతి = నిలుపుచున్నాఁడు.

తాత్పర్యము. పాలసముద్రమును దఱచెడ నంచుదు పుట్టిన చంద్రుని విషము ను పరమేశ్వరుఁడు పరిగ్రహించి, చంద్రునిఁ దలయందు భూషణముగానుంచికొని విష మును వెలిబఱచక యేతీరున తనకంఠమందే నిలిపి కొనియెనో ఆప్రకారము నేర్పరియగు వాఁడు కావ్యములందు సౌకుమార్యమాధుర్యప్రసాదాది గుణములను, అప్రయుక్తక్లిష్టా దికావ్యదోషములను దెలిసినవాఁడై గుణములను శిరఃకంపనపూర్వకముగా పొగడుచు న్నాఁడనియు, దోషములను వెలిబఱుపక కంఠమందే యణఁచుకొను చున్నాఁడనియుఁ దెలియవలయును. ఇట్లనుటచేఁగవియుఁ బ్రమాదవశమున నెందేని యప్రయుక్తాదికావ్య ములను బ్రయోగించియున్నచో దానినిగన్న విద్వాంసుఁ డట్టిదోషములను చాటింపక గుణములనే గ్రహింపవలయుననియు, తాను తప్పులులేక కావ్యమును జెప్పువాఁడను నహంకారమును జెప్పక తనతప్పులను మన్నింపవలయుననియు, పరమేశ్వరుని యుపమాన పూర్వకముగాఁ జెప్పి పండితులను బ్రార్థించుచున్నాఁడు. ౧

అవ. ఇప్పుడు సత్కావ్యప్రశంసాముఖముగా కావ్యమును బ్ర శంసించు చున్నాఁడు:—

శ్లో. శబ్దశక్త్యైవ కుర్వాణా సర్వదానవ నిర్వృతిమ్,
కావ్యవిద్యా శ్రుతిగతా స్యాన్మృతస్యాపి జీవనీ. ౨

వ్యా.—ఇదానీం సత్కావ్యప్రశంసాముఖేన స్వకావ్యం ప్రశంసతి-శబ్దేతి.శబ్ద శక్త్యా శబ్దానాం శక్తిర్నామ వివక్షితార్థాభిధాయకత్వం తయా శక్త్యా, సర్వదా నవ నిర్వృతిం, నవా చాసౌ నిర్వృతి శ్చేతి విశేషణసమాసః-తాం నవనిర్వృతిం, నూతన సుఖం, కుర్వాణా, కరోతే స్తాచ్ఛీల్యే చానశ్ ప్రత్యయః. కావ్యవిద్యా కావ్యం నామ 'సగుణౌ సాలంకారా దోషరహితౌ శబ్దార్థౌ' తా వేవ విద్యా సా కావ్యవిద్యా, శ్రు తిం కర్ణం, గతా, శ్రుతేతి యావత్. తథాభూతా సతీ, మృతశబ్దే నోపచరితవృత్త్యా మూఢో లక్ష్యతే. జీవతీతి జీవనీ జీవయిత్రీ స్యాత్ అంతర్భావితణ్యర్థోఽయం కావ్య విద్యా శ్రుతమాత్రా మూఢ మ ప్యానందయతి కిముత రసికమి త్యపిశబ్దార్థః.

అన్యోఽప్యర్థః. శబ్దః శబ్దనం, ఉచ్చారణ మిత్యర్థః. తస్య శక్త్యా మహిమ్నా హేతునా, సర్వేషాం దానవానాం రాక్షసానాం నిర్వృతిం పునరుజ్జీవనరూపం సుఖం, కుర్వాణా, కావ్యస్య శుక్రస్య విద్యా, సంజీవనీ విద్యే త్యర్థః. ని. 'శుక్రో దైత్యగురుః కావ్య'ఇత్యమరః.శ్రుతిగతా కర్ణే ఉపవిష్టా సతీ,మృతస్య మరణం ప్రాప్తస్యాపి, రక్షో బలస్యేతి శేషః. జీవనీ జీవయిత్రీ, స్యాత్. శుక్రః కదనే మృతా నసురాం త్సంజీవనీ విద్యయోజ్జీవయతీతి పురాణకథా శ్రూయతే.

టీ. శబ్దశక్త్యైవ-శబ్ద = శబ్దములయొక్క, శక్త్యైవ=చెప్పఁదగిన యర్థములను జెప్పెడిసామర్థ్యముచేతనే, సర్వదా = ఎప్పుడును, నవనిర్వృతిం = నూతనసుఖమును, కుర్వాణా = చేయుచుండెడి, కావ్యవిద్యా = గుణాలంకారసహితంబై యప్రయుక్తాది దోషరహితంబైన కవిత్వవిద్య, శ్రుతిగతా = చెవికివినఁబడినదియై, మృతస్యాఽపి = మూఢునకుఁగూడ (ఇందు మృతశబ్ద ముపచారవృత్తిచే మూఢునిపరం బగును), జీవనీ=జీవముగలుగఁజేయునది, స్యాత్ = అగును. (అనఁగా సంతసింపఁజేయునది యగును.)

అర్థాంతరము. శబ్దశక్త్యైవ - శబ్ద = ఉచ్చారణముయొక్క, శక్త్యైవ=మహిమకారణముచేతనే, సర్వదానవనిర్వృతిం - సర్వదానవ = సమస్త రాక్షసులయొక్క, నిర్వృతిం = మరలబ్రతికించుటయనెడి సౌఖ్యమును, కుర్వాణా = చేయుచుండెడి, కావ్యవిద్యా - కావ్య=శుక్రునియొక్క, ('శుక్రోదైత్యగురుః కావ్య' అని యమరము.) విద్యా=సంజీవనీవిద్య, శ్రుతిగతా=చెవినిఁబొందినదియై, మృతస్యాఽపి = చచ్చినరక్కసులబలమునకుఁ గూడ, జీవనీ=జీవంబొసంగునది, స్యాత్=అగును.

తా. రాక్షసులకు గురువగు శుక్రాచార్యుఁడు ఏలాగున తనసంజీవనీవిద్యయొక్క యుచ్చారణమాత్రముచేతనే యుద్ధమందు మృతులగు దైత్యులను జీవింపఁజేయుచు వారికి నూతనసుఖమును గలుగఁజేయునో, ఆలాగుననే కవిత్వము చెప్పెడి పండితుఁడు తనశబ్దశక్తిచేత నూతన సుఖములును గలుగఁజేయుచు వినికిచేతనే మృతప్రాయు లగు మూఢులకుఁగూడ సంతోషము నొనర్చును.

మఱియు పూర్వము శుక్రుఁడుమృతసంజీవినియను నొకవిద్యను నేర్చుకొని యందుచే మృతులగు దైత్యులను బ్రతికించుచుండఁగ దేవత లావిద్యను గ్రహించుటకు బృహస్పతి సుతుఁడగు కచుండనువాని శుక్రునియొద్దకు బంపఁగా నతఁడు గురువునారాధించి యావిద్యను బడసె నని భారతమున నాదిపర్వమునఁ జెప్పంబడినది. ఈ విద్య కేవల మంత్రోచ్చారణము మంగనుత్రస్రూతమగు నౌషధముగను బ్రయోగించుటచేతను సిద్ధించును.ఇదియు గాయత్రీమంత్రగర్భితంబగు మృత్యుంజయమంత్ర మై యొప్పియున్నది. దీనివిధానంబు కౌతుకరత్నభాండాగారం బనుగ్రంథమున ౩౦౮ - ౩౦౯ పుటములందును, రసరత్నాకర మంత్రఖండమందును జూడందగును. ౨

అవ. కావ్యంబు సుందర మనుట వివేకులయంద వెల్గు నని చెప్పుచున్నాఁడు:—

శ్లో. కల్యాణవర్ణపదతాం వాగ్విద్యుదివ బిభ్రతీ,
అభ్రాన్తేషు సదాసారసంగిషు స్యాత్స్ఫురద్గుణా. 3

వ్యా.—కావ్యం సుభగ మితి వివేకి ష్వేవ శోభత ఇ త్యాహ-కల్యాణేతి. కల్యాణాని ప్రశస్తాని వర్ణానియేషాంతానికల్యాణవర్ణాని తాని పదాని యస్యా స్సా తథోక్తా. తస్యాభావ స్తత్తాతాం.బిభ్రతీ వాక్ వాణీ, సదా,సర్వదా, సారసంగిషు గుణగ్రాహిషు, భ్రాంతానభవంతీ త్యభ్రాంతాః వివేకినః తేషువిషయే స్ఫురంతః విరాజమానాః గుణాశ్లేషాదయో యస్యా స్సాభవేత్ విద్వా నేవ విజానాతి శబ్దశక్తి మిత్యర్థః. కథం? విద్యుత్తటి దివ. సాఽపి కల్యాణవర్ణపదతాం సువర్ణవర్ణాశ్రయతాం బిభ్రతీ సతీ,ని.'కల్యాణ మక్షరే స్వర్ణే కల్యాణం మంగళేఽపి చే'తి విశ్వప్రకాశః. ని. 'పదం వ్యవసితత్రాణస్థాన లక్ష్మాంఘ్రివస్తుష్వి'త్యమరః.సదా సారసంగిషు ప్రశస్తవృష్టిధారాసంబంధవత్సు అభ్రాంతేషు మేఘేషు, అంతశబ్దోఽత్ర స్వరూపవచనః,స్ఫురత్ గుణః పీతాదిః యస్యా స్సా భవతి.

టీ. కల్యాణవర్ణపదతాం-కల్యాణ = శుభములైన, వర్ణ = అక్కరములుగల, పదతాం = పదములభావమును, బిభ్రతీ = వహించుచుండెడి, వాక్ = కావ్యమందలి పలుకు, సదా = ఎల్లపుడు, సారసంగిషు=గుణగ్రాహకులగు, అభ్రాన్తేషు = భ్రాంతులు కానివారి (వివేకుల) విషయమందు, స్ఫురద్గుణా - స్ఫురత్ = వెలుగుచుండెడి, గుణా =శ్లేషాదిగుణములుగలదియై, విద్యుత్=మెఱుమువలె, స్యాత్ = ప్రకాశించుచుండును.

అర్థాంతరము. కల్యాణవర్ణపదతాం - కల్యాణవర్ణ = బంగరు వన్నెయొక్క, పదతాం = ఆశ్రయభావమును, బిభ్రత్ = భరించుచున్నదియై, సదాసారసంగిషు= శ్రేష్ఠములగు జల్లులనుబొందియుండెడి, అభ్రాన్తేషు = మేఘములందు, స్ఫురద్గుణా - స్ఫురత్ = ప్రకాశించుచుండు, గుణా = పచ్చవన్నెగల, విద్యుత్ = మెఱుమువలె, స్యాత్ = ప్రకాశించుచుండును.

తా. బంగరురంగులను దురంగలించు మెఱుంగుతీవెలు మేఘములపై నెట్లు పచ్చనిరంగులచే తెలఁగుచుండునో, అట్లు మంచియక్కరంబుల పదంబులతోఁ గూడిన సత్కావ్యములు ఎల్లపుడును గుణగ్రాహకు లగు వివేకులయందు శ్లేషప్రసాద మాధుర్యాది గుణములతోఁ గూడినవియై ప్రకాశించును. 3

అవ. ఇపుడు వివేకు లనేకులు పుట్టుటలేదని చెప్పుచున్నాఁడు:-

శ్లో. గూఢభావాస్పద త్వేన య దనాదేయవ ద్భవేత్,
సారస్వతామృతం సర్వే కవయ స్తన్న జానతే. 3

వ్యా.—ఇదానీం వివేకినో న బహవో విద్యంత ఇత్యాహ-గూఢేతి. యత్ సరస్వత్యాః వాగ్దేవతాయా ఇదం సారస్వతం తదేవామృతం సుధా కర్తృ, గూఢభావో

గూఢాభిప్రాయః తస్యాస్పదత్వే నాశ్రయత్వేన అనాదేయవత్ అనుపాదేయ మివ భవేత్ తత్సారస్వతం కర్మ, సర్వే విద్వాంసః కవయః, న జానతే న విదుః-కేచి దేవ జానత ఇత్యర్థః. 'అత్మనేపదేష్వనత' ఇతి ఝస్యా దాదేశః.

అన్యోఽప్యర్థః. యత్ సరస్వతీనామనదీ తస్యా ఇదం సారస్వతం త దమృతం జలంకర్తృ. ని. 'పయః కీలాలమమృత' మిత్యమరః. గూఢభావస్య గూఢత్వ స్యాశ్రయ త్వేన, ఉపరిసికతావృతత్వాదితి భావః అనాదేవయత్ నద్యా ఇదం నాదేయం 'నద్యా దిభ్యో ఢ'గితి శైషికో ఢక్-త న్న భవతి అనాదేయం తద్వత్ భవేత్-తత్సారస్వతం నదీసంబం ధ్యమృతం, సర్వేకవయః సర్వే జలపక్షిణః, న జానతే కేచి దేవ హంసాద యో జానత ఇత్యర్థః.

టీ. యత్=ఏ, సారస్వతామృతం-సారస్వత=సరస్వతీ సంబంధమైన, అమృతం=కావ్యామృతము, గూఢ=రహస్యమైన, భావ=అభిప్రాయమునకు, అస్పదత్వేన=ఆశ్రయ మగుటచే, అనాదేయవత్=గ్రహింపఁగూడనియట్లు, భవేత్=అగునో, తత్=అసార స్వతామృతమును, కవయః=విద్వాంసులు, సర్వే=అందఱు, నజానతే=తెలియరు.

అర్థాంతరము. యత్=ఏ, సారస్వతామృతం = సరస్వతీనదీసంబంధమైన నీరు, గూఢభావాస్పదత్వేన - గూఢభావ=రహస్యముగా లోపలనే ప్రవహించుచు పైనికను పింపకుండుటకు, ఆస్పదత్వేన=ఆధారమగుటచే, అనాదేయవత్=నదీ సంబంధముకానిది వలె, భవేత్=అగునో, తత్=అట్టి సరస్వతీనదీజలమును, సర్వేకవయః=అన్ని జలపక్షులు, నజానతే=తెలియఁజాలవు.

తా. గుప్తగామినియైన సరస్వతీనదియొక్క జలమును కొంగలు మొదలగునన్ని జలపక్షులు దెలిసికొనక, హంసలు మొదలగుకొన్ని మాత్ర మేరీతిగాఁదెలిసికొనుచున్నవో, అవ్విధమున గూఢములైన రసభావాదులను శ్లేషాదిగుణములుగల కావ్యామృతమును సామాన్యవిద్వాంసు లందఱు దెలిసికొనరనియు మంచిపండితులు కొందఱుమాత్రమే తెలిసి కొందురనియుభావము. అనఁగా రహస్యమైనశ్లేషాదిగుణములుగలనాకావ్యము సామాన్య పండితులకుఁ దెలియదనుట. ఇచట సరస్వతీనది యన్నినదులవలె ప్రవహింపక గంగా యమునలలో నంతర్భూతమై ప్రవహించుచున్నదని పురాణప్రసిద్ధము. ౪

అవ. విద్వాంసు లనేకు లుండినను దాత లట్లుండరని చెప్పు చున్నాఁడు:—

శ్లో. స ఏవ కేవలః కర్ణః శ్రేయాన్ సద్గేషు గణ్యతే,
యః కుణ్డలస్య వహనా త్త్యాగేనైవ ప్రకాశతే. ౫

వ్యా.—సత్స్వపి విద్వత్సు బహుషు దాతారో న బహవ స్సంతీత్యాహ-సఇతి. సః ప్రసిద్ధః కేవలః ఏకః. ని. 'కేవలః కృత్స్న ఏక శ్చే'తి శాశ్వతః. కర్ణో రాధేయ ఏవ అంగేషు దేశవిశేషేషు శ్రేయాన్, ఔదార్యత ఇతి యావత్ గణ్యతే కథ్యతే యః కర్ణః కుండలస్య సూర్యదత్తస్య వహనా ద్ధారణా త్ప్రకాశతే త్యాగే సతి న ప్రకాశతే అప్రకాశనం చ పరిపంథిగణాజేయతాభంగలక్షణమైహిస్య ప్రయుక్తం.యద్వా-రాధేయః కుండలస్య త్యాగే యథా ప్రకాశతే తథావహనా న్నైవ ప్రకాశతే. 'అని మ్నా శోభంతే గళితవిభవా శ్చార్థిషు నృపా'ఇతి భావః.

అన్యోప్యర్థః. అంగేషు వపురాది ష్వవయవేషు మధ్యే ఏకః కేవలః కర్ణః శ్రవణ మేవ శ్రేయాన్ శ్రేష్ఠ ఇతి గణ్యతే-యః కర్ణః కుండలస్య కర్ణ వేష్టనస్య వహనా త్ప్రకాశతే-తస్య త్యాగే సతి నైవ ప్రకాశతే.

టీ. యః=ఎవఁడు, కుణ్డలస్య=సూర్యదత్త కర్ణాభరణముయొక్క, వహనాత్= ధారణమువలన, ప్రకాశతే=శత్రువిజయముచే వెలుంగునో, త్యాగేన=విడుచుటచేత, నైవప్రకాశతే=ప్రకాశింపఁడో, (లేక, కుణ్డలస్యవహనాత్=కర్ణభూషణధారణమున కంటె, త్యాగేనైవ=దానినివిడుచుటచేతనే, ప్రకాశతే = వెలుంగుచున్నవాఁడో, సః= అట్టి, కేవలః=ఒకఁడైన, శ్రేయాన్ = ఔదార్యముచేశ్రేష్ఠుఁడైన, కర్ణఏవ=కర్ణుఁడే, అఙ్గేషు=అంగదేశమందు, గణ్యతే=ఎన్నఁబడుచున్నాఁడు.

అర్థాంతరము. యః=ఏచెవి, కుణ్డలస్య=కర్ణాభరణముయొక్క, వహనాత్= ధారణమువలన, ప్రకాశతే=వెలుంగుచున్నదియో, త్యాగేసతి=విడువఁగా, నైవప్రకాశతే=వెలయదో, సః=అట్టి, కేవలః=ముఖ్యమైన, కర్ణఏవ=చెవియే, అఙ్గేషు= అవయవముల మధ్యమందు, ప్రకాశతే=వెలుఁగుచున్నది.

తా. సకల శరీరావయవములును జెవిపోగులవలన నెట్లు మిక్కిలి ప్రకాశించు చున్నదో, యవ్విధమున దాతలగువారనేకులుండినను, తాను జనించినపుడు సూర్యునిచే నియ్యఁబడిన సహజములైన కవచకుండలములుగల కర్ణుఁడు ఇంద్రునిచే యాచింపఁబడిన వాఁడై తనకు జయము నొసంగుచు నలంకారమైయుండు కర్ణకుండలములను ఇంద్రునికి దానముచేసిన యారాధేయుఁడొకఁడే అంగదేశమందు ప్రసిద్ధుఁడైనవాఁడు.

పూర్వమున, పాండురాజపత్నియైన కుంతిదేవి తనచిన్నవాఁడు దుర్వాసుఁడను మునినారాధించుచు ప్రసన్నుఁడగు నామునివలన నొకమంత్రమునుబడసి యామంత్ర మహిమ నెఱుంగ వేఁడి సూర్యుని బిలిచిన నాతఁ డామెతోఁ గ్రీడించిపోఁగా, గర్భిణి యై సిగ్గుచేతను భయముచేతను తాఁగనినశిశువును నదియందుపాఱవైచిచనినంత, సూర్య దత్తకవచకుండలములచే వెలింగెడి యక్కుమారుఁడు సూతుఁడనువానికిఁ జిక్కి,

రాధ యను నతనిభార్యకు పుత్త్రుఁడై రాధేయుఁ డనఁబరఁగి దుర్యోధనునింటఁ బెరిఁగి యర్జునునకు విరోధియైనందున నింద్రుఁడు తనకొమరుఁడగునర్జునునకు శుభముకలుగుటకై జయప్రదమైన యాకుండలములను వేఁడినప్పుడు దాని నిచ్చుటచే కర్ణునకు మహాదాత యనుపేరు గలిగె నని భారతకథ నిట ననుసంధించునది. ౫

శ్లో. వసన్నప్యవదాతానాం ద్విజానాం సవిధే సదా,
రాగానుబన్ధమధరో న కదాచి ద్విముఞ్చతి. ౬

వ్యా.—వసన్నితి. అవదాతానాం శుద్ధానాం, దైప్ శోధనఇత్యస్మా ద్ధాతోః కర్తరి నిష్ఠా ద్విర్జాయంతే జన్మకర్మభ్యా మితి ద్విజాః. శ్లో. 'మాతు ర్యదగ్రే జాయంతే ద్వితీయం మౌంజిబంధనాత్, బ్రాహ్మణక్షత్రియవిశ స్తస్మా దేతే ద్విజా స్మృతా' ఇతి యాజ్ఞవల్క్యస్మరణా దితి భావః. తేషాం సవిధే సమీపే, వస న్నపి సదా అనవరతం, అధరః నికృష్టః, నీచాశ్రయవత్. రజ్యంతే మనో మనోరమా ఇవ ప్రతీయంత ఇతి రాగాః విషయాః తై రనుబధ్యత ఇత్యనుబంధః సంబంధః తం రాగానుబంధం, కదాచి త్కాలాంతరేఽపినవిముంచతి. 'సంసర్గజా దోషగుణా భవం'తీత్యేత న్స్మృ షేతిభావః. అథవా రాగో మాత్సర్యం. ని. 'రాగోఽనురాగే మాత్సర్య'ఇతి విశ్వః. తేనఅనుబంధః దోషోత్పాదనం. ని. 'అనుబంధః ప్రకృత్యాదా దోషోత్పాదే నరేశ్వర' ఇతి విశ్వః.

అన్యోఽప్యర్థః. అవదాతానాం శుభ్రాణాం. ని. 'అవదాత స్సితే గౌర' ఇత్యమరః. ద్విజానాం దంతానాం. ని. 'దంతవిప్రాండజా ద్విజా' ఇత్యమరః. సవిధే సదా వస న్నపి అధరః ఓష్ఠః కదాచి దపి రాగేణ రక్తిమ్నా అనుబంధం న విముంచతి. త త్తస్య స్వాభావిక మిత్యర్థః.

టీ. అధరః=నీచుఁడు, అవదాతానాం = పరిశుద్ధులైన, ద్విజానాం=బ్రాహ్మణ క్షత్త్రియ వైశ్యులయొక్క, సవిధే=సమీపమందు, సదా=ఎపుడును, వసన్న పి=ఉండు వాఁడైనను, కదాచిత్=ఒకానొకప్పుడును, రాగానుబన్ధం=విషయాసక్తిసంబంధమును, నవిముఞ్చతి=విడువఁడు.

అర్థాంతరము. అధరః=పెదవి, అవదాతానాం=తెల్లనైన, ద్విజానాం = దంతములయొక్క, సవిధే=చెంగట, సదా=ఎప్పుడును, వసన్నపి = ఉండునదియైనను, రాగానుబన్ధం=ఎఱ్ఱదనముతోడిసంబంధమును, కదాచిత్ = ఒకానొకపుడును, నవి ముఞ్చతి=విడువదు.

తా. నీచుఁడగువాఁడు పరిశుద్ధులైనబ్రాహ్మణాదుల సమీపమందు సదావాసము చేయుచుండినను తెలుపువన్నెగల పండ్లసమీపమందుండు పెదవి యెట్లు తన

యెట్టిదనమును విడువదో, అవ్విధమున దనవిషయాసక్తిని విడువఁజాలఁడు. ఇట్లనుటచే సహవాసమువలన గుణములు వేఱగుననుమాట యబద్ధమనియు, స్వభావగుణము నెవ్వఁడు విడువఁడనియుఁ భావము. ౬

శ్లో. అలకాశ్చ ఖలాశ్చైవ మూర్ధ్ని భీరుజనైర్ధృతాః,
ఉపర్యుపరిసత్కారే ప్యావిష్కుర్వన్తివక్రతామ్. ౭

వ్యా.—భీరూణాం స్త్రీణాం జనైః మూర్ధ్ని ధృతాః, అలకాః చూర్ణకుంతలాః, ఉపర్యుపరి సత్కారేఽపి, తైలాదినేతి శేషః వక్రతాం అనృజుత్వం, ఆవిష్కుర్వంతి. ఖలాః దుర్జనాః, భీరూణాం భయశీలానాం, జనైః మూర్ధ్ని ధృతా అపి ఉపర్యుపరి సత్కారేఽపి, ధనాదిభి రితి శేషః వక్రతాం దౌర్జన్యలక్షణం, ఆవిష్కుర్వంతి ప్రకటీకుర్వతే. ఉపర్యుపరీతి నిత్యవీప్సయో రితి ద్విర్భావః.

టీ. భీరుజనైః=స్త్రీజనులచే, మూర్ధ్ని=శిరస్సునందు, ధృతాః = ధరింపఁబడిన, అలకాశ్చ=ముంగురులును, ఉపర్యుపరి=పైపైన, సత్కారేఽపి = తైలాదులచే నుపచారములు గలుగుచుండినను, వక్రతాం=వంకరదనమును, అవిష్కుర్వన్తి=కలుగఁజేయుచున్నవి.

అర్థాంతరము. ఖలాశ్చ = దుర్జనులును, భీరుజనైః = భయపడెడిజనములచేత, మూర్ధ్ని=శిరసునందు, ధృతా అపి = ధరింపఁబడినవారైనను, ఉపర్యుపరి = పైపైన, సత్కారేఽపి=ధనాదులచే నుపచారము గలుగుచుండినను, వక్రతాం = దుష్టభావమును, ఆవిష్కుర్వన్తి = ప్రకటించుచున్నారు.

తా. చెలులచేత నూనె మొదలగువానిచే నుపచరింపఁబడిన శిరమందలి ముంగురు లేలాగు దమవక్రభావమును విడువవో, అట్లే దుష్టులగువారు భయపడువారిచే నమస్కరింపఁబడినవారై ధనాదులచే నాదరింపఁబడినవారైనను, తమస్వభావమగు దౌర్జన్యమును మానరు. ౭

శ్లో. గుణానార్తిం పరాం నీత్వా ధనినో ధన్వినో యథా,
నిఘ్నన్తి హృదయం దృప్తా విదుషాం విద్విషా మివ. ౮

వ్యా.—గుణానితి. ధనినః ధనవంతః పురుషాః,దృప్తా ఉద్ధతా స్సంతః,గుణాన్ అమానిత్వాదీన్, పరా ముత్కృష్టాం, ఆర్తిం పీడాం, నీత్వా గుణాన్ దోషీకృ త్యే త్యర్థః. ని. 'ఆర్తిః పీడాధనుష్కోట్యో'రిత్యుభయత్రా ప్యమరః. గత్యర్థత్వా న్నయతే ర్ద్వికర్మకత్వం తేషాం విదుషాం,హృదయం మనః, నిఘ్నంతి క్లేశయంతి. కథం?ధన్వినో యథా ధానుష్కా ఇవ, ధన్వన్శబ్దస్య వ్రీహ్యాదిత్వా దినిప్రత్యయః. 'ధన్వీతి వ్రీహ్యాది

పాతా' దితి వామనః. తే దృప్తాః రణలాభా ద్ధృష్టా స్సంతః, 'దృపహర్ష మోహనయో' రిత్యస్మా ద్ధాతోః క ర్తరి నిష్ఠా-గుణాన్ మౌర్వీః. ని. 'మౌర్వీ జ్యా శింజినీ గుణ' ఇత్య మరః. పరా ముత్తరాం ఆ ర్తింధనుష్కోటిం, నీత్వా ప్రాపయ్య, విద్విషాం హృదయం వక్షో నిఘ్నంతి విధ్యంతి.

టీ. ధనినః=ధనముగలవారు, దృప్తాః సంతః=గర్వించినవారై, గుణాన్ = విన యాదిగుణములను, పరాం=హెచ్చైన, ఆ ర్తిం=పీడను, నీత్వా=పొందించి, ధన్వినో యథా=విలుకాండ్రవలె, విదుషాం=విద్వాంసులయొక్క, హృదయం=మనసును,విద్విషా= శత్రువులయొక్క, హృదయమివ=ఎదనువలె, నిఘ్న న్తి=తల్లడింపఁజేయుచున్నారు.

అర్థాంతరము. ధన్వినః=విలుకాండ్రు, దృప్తాస్సంతః=రణలాభముచే హర్షము గలవారై, గుణాన్ = అల్లెత్రాళ్లను, పరాం=శ్రేష్ఠమైన, ఆ ర్తిం=వింటికొప్పును, నీత్వా= పొందించి, ధనినోయథా=ధనవంతులువలె, విద్విషాం=శత్రువులయొక్క, హృదయం = ఎదను, విదుషాం=విద్వాంసులయొక్క, హృదయమివ=మనస్సునువలె, నిఘ్న న్తి= కొట్టుచున్నారు.

తా. యుద్ధాపేక్షగల విలుకాండ్రు తమధనుస్సుల కొప్పులందు అల్లెత్రాళ్లను బొందించి శత్రువులహృదయములను భేదించునట్లు, ధనవంతులు గర్వించినవారై విన యాదిసద్గుణములను నశింపఁజేసి విద్వాంసుల మనసులను వ్యథపఱచుచున్నారు. ౮

శ్లో. కృపాణేన కథంకారం కృపణ స్సహగణ్యతే,
పరేషాం దానసమయే యస్స్వకోశం విముఞ్చతి. ౯

కృపాణేనేతి. కృపణః లోభీ కృపాణేన కరవాలేన సహ. ని. 'కరవాలః కృపా ణవ'దిత్యమరః. కథంకారం? కథ మిత్యర్థః. 'అన్యథైవ' మిత్యాదినా కరోతే ర్ణిరర్థకా ణ్ణముల్ప్రత్యయః. గణ్యతే కథ్యతే కృపణస్య కృపాణేన సామ్యాభిధాన మనుచిత మిత్యర్థః. తత్ర హేతు మాహ-యః కృపాణః, పరేషాం శత్రూణాం దానస్య విదార ణస్య సమయే కాలే, స్వస్య కోశం పిధానం, విముంచతి. ని. 'కోశోఽస్త్రీ కుట్మలే ఖడ్గపిధానేఽర్థౌఘదివ్యయో' రిత్యమరః. కృపణో హి పరేషాం అర్థినాం దానస్య విత రణస్య సమయే కాలే, స్వస్య కోశ మర్థౌఘం, న విముంచతీతి కృపాణా దపి కృప ణస్య నికృష్టత్వమితి ధ్వనిః.

టీ. యః=ఏకృపాణము (కత్తి), పరేషాం=ఇతరులయొక్క, దానసమయే= విదారణసమయమునందు, స్వకోశం = తనయొఱను, విముఞ్చతి = విడుచుచున్నదో, (అట్టి కత్తి) పరేషాం=ఇతరులకు, దానసమయే=ఇచ్చెడివేళలో, స్వకోశం = తనధన

సముదాయమును ఇయ్యని, కృపణః=లోభి, కృపాణేన=కత్తితోడ, కథంకారం= ఎవ్విధమున, గణ్యతే=ఎన్నఁబడును? (అనఁగా గౌరవింపఁబడఁడు.)

తా. పరులను ఖండించుసమయమందు తనకోశమును (యొరను) విడుచుచుండు కృపాణము (కత్తి) తోడ, పరదాన సమయమందు తనకోశమును (ధనమును) వదలని కృపణుఁడు (లోభి) సరిగాఁడు. ప్రాణనాశక మైన కత్తికంటె లోభి నీచుఁడు.

శ్లో. దృఢతరనిబద్ధముష్టేః కోశనిషణ్ణస్య సహజమలినస్య,
కృపణస్య కృపాణస్యచ కేవల మాకారతో భేదః. అని గ్రంథాంతరము.

శ్లో. మూర్ఖాశ్చ ముకురా శ్చైవ భృశం భూత్యవలేపినః,
పరేషాం ననురూపాణి విపర్యాసేన గృహ్ణతే. ౧౦

వ్యా.—మూర్ఖాఇతి. మూర్ఖా అజ్ఞాః, భృశ మత్యర్థం, భూత్యా సంపదా, అవలేపః గర్వః, యేషాం తే తథోక్తా స్సంతః, ని. 'భూతి ర్భస్మని సంపదీ'త్యమరః. పరేషాం రూపాణి స్వభావాన్, ని.'రూపం స్వభావే సౌందర్యే చాకార శ్లోకయోరపీ'త్యమరః. విపర్యాసేన వైపరీత్యేన, గృహ్ణతే నను జానంత్యేవ. ననుశబ్దో ఽవధారణే.ముకురా శ్చ భృశం భూత్యా భస్మనా అవలేపో మర్దనం యేషాం తే తథోక్తా స్సంతః. ని. 'అవలేపస్తు గర్వే స్యా ల్లేపనే దూషణేఽపి చే'తి విశ్వః. పరేషాం రూపా ణ్యాకారాన్ విపర్యాసేన విపరీతత్వేన గృహ్ణతే నను గృహ్ణంత్యేవ 'అత్మనే పదేష్వనత 'ఇతి ఝస్యాదాదేశః.

టీ. మూర్ఖాః=తెలియనివారు, భృశం=మిక్కిలి, భూత్యవలేపినః-భూతి=సంపద చేత, అవలేపినః=గర్వముగలవారై, పరేషాం=ఇతరులయొక్క, రూపాణి=స్వభావములను, విపర్యాసేన=వ్యత్యాసముచేత, గృహ్ణతేనను=అవశ్యకముగాఁ దెలియుచున్నారు.

అర్థాంతరము. ముకురాశ్చ=అద్దములును, భృశం=మిక్కిలి, భూత్యవలేపినః- భూతి=భస్మముచేత, అవలేపినః=పూఁతగలవియై, పరేషాం = ఇతరుల, రూపాణి = ఆకారములను, విపర్యాసేన=వ్యత్యాసముచేత, గృహ్ణతేనను=గ్రహించుచున్నవిగదా.

తా. గాజుబిల్లలు భస్మము మొదలగువానిచే పూయఁబడినవియై ఇతరుల యాకారములను దారుమారుగా నెట్లు గ్రహించుచున్నవో, యవ్విధమున మూర్ఖులగువారు ఐశ్వర్యమదముగలవారై పరులనుగుణములను దుర్గుణములుగా భావింతురు.

శ్లో. జాడ్యంహ్రీమతిగణ్యతేవ్రతరుచౌ దమ్భశ్శుచౌ కైతవం
శూరే నిర్ఘృణతామునౌ విమతితా దైన్యం ప్రియాలాపినీ,

తేజస్వ్యన్యవలి ప్తతా ముఖరతా వ క్తవ్య శ క్తిస్థిరే
తత్కో_నామగుణో భ వే త్సుగుణినాం యోదుర్జనై ర్నాఙ్కితః,
ఇట దీని ననుసంధింపవలయును.

శ్లో. మధువ్రతాశ్చ మూర్ఖాశ్చ రజసా రూక్షతాం గతాః,
నిత్య మా క్రమ్య గృహ్ణన్తి సారం సుమనసాం ముఖాత్. ౧౧

వ్యా.—మధువ్రతాఇతి. మధువ్రతాః భృంగాః, రజసా పుష్పపరాగేణ, రూక్షతా మస్నిగ్ధతాం, గతాః ప్రాప్తాః, నిత్యం ప్రత్యహం, ఆక్ర మ్యాధిష్ఠాయ; విభ క్తిపరిణామేన సుమనస ఇతి యోజ్యం. సుమనసాం పుష్పాణాం, ని. 'స్త్రియ స్సుమ నసః పుష్ప' మిత్యమరకోశే. ముఖా దగ్రాత్, సారం స్థిరాంశభూతం మకరందం, ని. 'సారో బలే స్థిరాంశే చ న్యాయ్యే క్లీబం వరే త్రిష్వి'త్యమరః. గృహ్ణంతి స్వీకుర్వ తే. 'మూర్ఖాశ్చ రజసా రజోగుణేన, గర్వేణే'తి యావత్. రూక్షతా మస్నేహతాం గతా స్సంతః, నిత్యం సుమనసం, ఆక్ర మ్యాక్షిప్య, తేషాం సుమనసాం విదుషాం, ము ఖాత్ ముఖసకాశాత్, సారం సారభూతం అర్థజాతం, గృహ్ణంతి జానతే.

టీ. మధువ్రతాః=తుమ్మెదలు, రజసా=పుప్పొడిచేత, రూక్షతాం = కాఠిన్య మును, గతాః=పొందినవిరై, నిత్యం=ప్రతిదినమందును, ఆక్రమ్య=పుష్పములందుండి, సుమనసాం=పుష్పములయొక్క, ముఖాత్ = కొనలనుండి, సారః=స్థిరాంశభూతమైన తేనెను, గృహ్ణన్తి = అంగీకరించుచున్నవి.

అర్థాంతరము. మూర్ఖాశ్చ = మూర్ఖులును, రజసా = రజోగుణరూపమైన గర్వముచే, రూక్షతాం=అస్నేహభావమును, గతాః=పొందినవారై, నిత్యం=ఎల్లపుడును, ఆక్రమ్య=విద్వాంసుల నాక్షేపించి,సుమనసాం=పండితులయొక్క, ముఖాత్ =సమీపము వలననుండి, సారం=శ్రేష్ఠమైనయర్థమును, గృహ్ణన్తి=తెలియుచున్నారు.

తా. తుమ్మెదలు పుప్పొడిచే మృదుత్వమునువదలి పూవులందును, వానియగ్ర ములవలననుండి పూదేనె నెట్లు గ్రహించుచున్నవియో, యాలాగుననే మూర్ఖులగువారు గర్వముచే విద్వాంసుల నాక్షేపించుచు వారిదగ్గరనుండి సరియైనయర్థములను గ్రహించు చున్నారని భావము.

శ్లో. ద్విజేన్ద్రోఽపి కలాఢ్యోఽపి కామచారీభవం త్సదా,
నిత్యం నిమజ్జన్న ప్యబ్ధౌ నాస్తశ్శుద్ధో భవత్యలమ్. ౧౨

వ్యా.—ద్విజేంద్రేతి. సదా అనవరతం, కామచారీ స్వేచ్ఛాచారీ, దురాచార ఇతి యావత్, భవన్ ద్విజేంద్రో విప్రవర్యోపి, కళాఢ్యోఽపి విద్యాసంపన్నోఽపి,

అనేకశాస్త్రాభిజ్ఞోఽపి నిత్య మబ్ధౌ, ఉపలక్షణ మేతత్. సముద్రే నదీప్రభృతిషు నిమజ్జ న్నపి, అంత శ్చిత్తే, అల మత్యర్థం, శుద్ధ శ్శుచి ర్నభవతీతి అంతరశుద్ధే రంత రంగత్వేన బలీయస్త్వా దితి భావః.

అన్యోఽప్యర్థః. కామచారీ అప్రతిహతగతిః భవన్ కళాభిః షోడశభిః ఆఢ్యోఽపి, సంపూర్ణ కిరణోఽపీత్యర్థః. పౌర్ణమాసాదియాగ హేతుతయా ద్విజానాం బ్రాహ్మణానాం, ఇంద్రోఽధిపతిః ద్విజేంద్ర శ్చంద్రమాః, 'సోమోఽస్మాకం బ్రాహ్మణా నాగ్ం రాజే'తి శ్రుతిః. నిత్య మబ్ధౌ సముద్రే, నిమజ్జ న్నపి, అస్తమయ ఇతి శేషః. అంత ర్మధ్యే శుద్ధః విమనా న భవతి. కళంకిత్వా త్తస్యేతిభావః.

టీ. సదా=ఎల్లపుడును, కామచారీభవన్=విచ్చలవిడిగాఁ దిరుగువాఁడు, ద్విజేన్ద్రో౽పి=బ్రాహ్మణశ్రేష్ఠుఁడైనను, కలాఢ్యోఽపి=విద్వాంసుఁడైనను, నిత్యం=నియతముగా.అబ్ధౌ=సముద్రమందును నది మొదలగు వానియందును,నిమజ్జన్నపి=స్నానముచేయువాఁడైనను, అంతః=మనసునందు, అలం=మిక్కిలి, శుద్ధః=పవిత్రుఁడు, నభవతి=కాఁడు.

అర్థాంతరము. సదా=ఎపుడును, కామచారీ = అడ్డములేని గమనముగలవాఁడు, భవన్=అగుచు, కలాఢ్యోఽపి-కలా=పదియాఱుకళలచే, ఆఢ్యోఽపి=సంపూర్ణకిరణములుగలవాఁడైనను, ద్విజేన్ద్రో౽పి-ద్విజ = బ్రాహ్మణులకు, ఇన్ద్రో౽పి=పౌర్ణమాసాది యజ్ఞకారణముచే రాజైనను 'సోమోఽస్మాకం బ్రాహ్మణానాగ్ంరాజా' అను శ్రుతిచే (చంద్రుఁడు బ్రాహ్మణులకు దొరయని తెలియవలయును), నిత్యం=నియతముగా, అబ్ధౌ= సముద్రమందు, నిమజ్జన్నపి=అస్తమయకాలమందు మునుఁగువాఁడైనను, అన్తః=బింబ మధ్యమందు, అలం=మిక్కిలి, శుద్ధః=నిర్మలమైనవాఁడు, నభవతి=కాఁడు.

తా. బ్రాహ్మణుఁడైనను సకలశాస్త్రములను దెలిసినవాఁడైనను వ్రతము లాచరించుచు తీర్థములందు స్నానముజేయువాఁడైనను విచ్చలవిడిగాఁ దిరుగుచుండెనేని, బ్రాహ్మణాధిపతియై యడ్డములేనిగమనముగలవాఁడై సంపూర్ణకలలతోఁగూడినవాఁడై అస్తమయకాలమందు సముద్రమందు మునుఁగుచుండెడి చంద్రునికి ఎదయందెవ్విధమున కందు దోఁచుచున్నదియో, యవ్విధమున స్వేచ్ఛాచారి యగువానికి చిత్తము పరిశుద్ధముగా నుండదు.

శ్లో. మహాప్రభఞ్జనం ప్రాప్య స్వాన్తేషు కలుషీకృతాః,
ప్రతికూలం విచేష్టంతే నీచాః కేఽపి జడాశయాః. ౧౩

వ్యా.—మహాప్రభమితి. జడాశయాః మందబుద్ధయః నీచాః, మహాప్రభం తేజస్వినం, 'అత్రాస్మహాత'ఇ త్యాత్వం. జనంరాజాదికం ప్రా ప్యాభిగమ్య, స్వాంతేషు మనస్సు, ని. 'స్వాంతం హృ న్మానసం మన'ఇత్యమరః.కలుషీకృతాః అకలుషాఃకలుషాః సంపద్యమానాః కృతాః కలుషీకృతాః, పాపబుద్ధిమంతఇత్యర్థః. అభూతతద్భావే చ్విః.

ని. 'కలుషం త్వావిలై నసోరితి విశ్వః. ప్రతికూలం అననుకూలం యథా తథా, విచేష్టంతే, వ్యాప్నువంతీతి యావత్.

అన్యోఽప్యర్థః. నీచాః స్వల్పాః కేఽపి జలాశయాః జలాధారాః తటాకాదయః, ని. 'జలాశయో జలాధార' ఇత్యమరః. మహాప్రభంజనం మహాంతం వాయుం, ని. 'పవన పవమాన ప్రభంజనా' ఇత్యమరః. ప్రాప్య స్వాంతేషు స్వమధ్యేషు కలుషీకృతాః ఆవిలాపాస్సంతః, కూలం రోధః కర్మ, ప్రతి లక్షీకృత్య, విచేష్టంతే వ్యాప్నువంతి, ఆగచ్ఛంతీతి యావత్.

టీ. జడాశయాః=మందబుద్ధిగల, నీచాః=దుర్జనులు, మహాప్రభం = హెచ్చైన తేజస్సుగల, జనం = రాజు మొదలగుజనమును, ప్రాప్య=పొంది, స్వాన్తేషు = మనస్సులందు, కలుషీకృతాః = పాపబుద్ధిగలవారై, ప్రతికూలం = అనుకూలముకానట్టుగా, విచేష్టంతే=వ్యాపించుచున్నారు.

అర్థాంతరము. నీచాః=అల్పములైన, కేఽపి=కొన్ని, జలాశయాః = చెఱువులు మొదలగునవి, (డలల కభేదముగనుక జడ యనుచోట జల యని తెలియవలయును) మహాప్రభఞ్జనం=పెద్దగాలిని, ప్రాప్య=పొంది, స్వాన్తేషు=తమమధ్యభాగములయందు, కలుషీకృతాః = కలఁగుడుగలవియై, కూలం=గట్టునుగుఱించి, విచేష్టన్తే=వచ్చుచున్నవి.

తా. అల్పములగు చెఱువులు మొదలగునవి పెద్దగాలి సోఁకుటచేత మధ్యభాగములందు కలుషితములై, దరుల నెవ్విధమున వ్యాపించుచున్నవో, యవ్విధమున నీచులగువారు తేజస్సుగల రాజు మొదలగువారి యాశ్రయమును సంపాదించి దానిచే గర్వితులై సాధువు లగువారికి ప్రతికూలముగా ప్రవర్తింతురు.

శ్లో. దత్వా వారం జనాయ స్వం దిక్షు గర్జన్తి యే ముహుః,
తా నుత్సేకవతః ప్రాప్య నన్దన్తి నవనీపకాః. ౧౮

వ్యా.—దత్వేతి. యే దాతార ఇత్యర్థః. దిక్షు స్థితాయ, జనాయ యాచకవర్గాయ, అవారం అనివారితం యథా తథా, స్వం ధనం దత్వా, స్వశబ్ద స్యార్థచాతుర్విధ్యం, 'ఆత్మాత్మీయజ్ఞాతిధనవాచీ స్వశబ్ద' ఇతి కాశికాః. ముహుః గర్జంతి భర్త్సయంతి,ఉత్సేకో గర్వః తద్వతః తాన్ దాతౄన్, ప్రాప్య అభిగమ్య,వనీపకా యాచకాః న నందంతి న తుష్యంతి, అవినయ స్యాప్రీతిహేతుత్వా దితి భావః.

అన్యోఽప్యర్థః. యే, మేఘా ఇత్యర్థః. జనాయ లోకాయ, ప్రాణనాయ స్వం స్వకీయం, వారం వారి, దత్వాఽభివృష్య, దిక్షు ముహుః గర్జంతి ధ్వనంతి, ఉత్సేకవతః ఉత్సేక స్సేచనం-వృష్టిరితియావత్-తద్వతో మేఘాన్ ప్రాప్యనవనీపకాః నూతన

కదంబవృక్షాః-నవశబ్దోత్రాతంత్రః-నందంతివ్యాప్యంతి, కుసుమితా భవంతీతియావత్, వర్షాసు ఖలు నీపః కుసుమితో భవతి.

టీ. యే=ఏదాతలు, దిక్షు=దిక్కులందుండు, జనాయ = యాచకజనమునకు, అవారం యథాతథా = తొందరలేనట్లుగా, స్వం=ధనమును, దత్వా=ఒసఁగి, ముహుః= పలుమాఱు, గర్జంతి=బెదరించుచున్నారో, ఉత్సేకవతః = గర్వముగల, తాన్=ఆదాతలను, ప్రాప్య=దగ్గరి, వనీపకాః=యాచకులు, న నన్దన్తి=సంతసించరు.

అర్థాంతరము. యే=ఏ మేఘములు, జనాయ=జనముకొఱకు (బ్రతుకుకొఱకు), స్వం=తనసంబంధమైన, వారం=నీరును, దత్వా=యిచ్చి, దిక్షు = దిక్కులందు, ముహుః=మాటిమాటికి, గర్జన్తి=ఉరుముచున్నవో, ఉత్సేకవతః = వర్షముగల, తాన్=ఆ మేఘములను, ప్రాప్య=పొంది, నవనీపకాః = క్రొత్తకడపమ్రాఁకులు, నన్దన్తి=పూచుచున్నవి.

తా. దాత లగువారు తొందరలేనట్టుగా యాచకులకు తమద్రవ్యము నొసంగి తమకు లోఁబడినయాయాచకులను పరుషవాక్కులచే బెదరించినచో యాచకులు వారి దగ్గరచేరి సంతసింపరు; అనఁగా దానమిచ్చిన పిదప బెదరింపరాదని భావము.

మేఘములు విఘ్నములేకవర్షించి తమజలమును జనులబ్రతుకునకై యిచ్చి గర్జించినచో కడపమ్రాఁకులు పుష్పించును. కడపచెట్లు వానకాలమందు పుష్పించుచున్నవని కవి సమయసిద్ధము.

శ్లో. నిత్య మక్షిగతస్యాపి దుర్జనస్యాఞ్జనస్య చ,
న లక్షయితు మాకార శ్శక్యస్స్వానుప్రవేశతః. ౧౫

వ్యా.—నిత్యమితి. నిత్యం అక్షిగతస్య దృష్టివిషయస్య, దృష్టస్యాపీతి యావత్. అథవా అక్షిగతస్య ద్వేష్యస్య. ని. 'ద్వేష్యే త్వక్షిగత' ఇత్యమరః. దుర్జనస్య ఆకారః ఆకృతిః వ్యాపారో వా స్వేన ధనేన అనుప్రవేశతో హేతోః లక్షయితుం ద్వేష్యత్వస్య లక్షీకర్తుం న శక్యః. అథవా స్వస్మిన్ స్వకీయే జనే అనుప్రవేశతో లక్షయితుం ద్రష్టుం న శక్యతే.

అన్యోఽప్యర్థః. నిత్యం అక్షిగతస్య స్త్రీణాం నయనగతస్య అంజనస్య కజ్జలస్య ఆకారః స్వరూపం స్వయోస్స్వకీయయోః నేత్రయోః అనుప్రవేశతో హేతోః లక్షయితుం దర్శయితుం న శక్య ఇతి. తత్తస్య స్వాభావిక మిత్యర్థః.

టీ. నిత్య=ఎల్లపుడును, అక్షిగతస్య = దృష్టివిషయమునుబొందిన, దుర్జనస్య=నీచునియొక్క, లేక (అక్షిగతస్య=ద్వేషింపఁదగిన, దుర్జనస్య=దుష్టునియొక్క,) ఆకారః=

ఆకృతి, లేక (వ్యాపారము,) లక్షయితుం=తెలియుటకు,నశక్యః=సాధ్యముకాదు. (అథ వా-స్వానుప్రవేశతః-స్వ=తనవారియందు, అనుప్రవేశతః = వెంబడించుటవలన తెలియుటకు సాధ్యముకాదు.)

అర్థాంతరము. నిత్యం=ఎల్ల కాలమును, అక్షిగతస్య=స్త్రీలకంటినిబొందిన, అంజనస్య=కాటుకయొక్క, ఆకారః=స్వరూపము, స్వానుప్రవేశతః-స్వ = తననేత్రముల యొక్క, అనుప్రవేశతః=ప్రవేశకారణమువలన, లక్షయితుం=చూచుటకు, నశక్యః= సాధ్యము కాదు.

తా. నిత్యము స్త్రీలకన్నులలోనుంచఁబడు కాటుక యెవ్విధమున ఆస్త్రీలకంటికి కానఁబడదో, యట్లు కంటికెదురుగనుండి ద్వేషింపఁదగిన నీచుని ద్రోహవ్యాపారమును గనుగొనుటకు శక్యము కాదు. కంటిచే నెదురుగనుండు పదార్థములను చూచుటకు సాధ్యమగునట్లు ఆకంటియందుండు వస్తువును జూచుటకు కాదనునది ప్రసిద్ధము. తనకు మిత్త్రునివలె కనఁబడుచు నంతరంగమందు ద్రోహముచేయువారినిఁ గాంచుటకుఁ దరముగా దనుట.

శ్లో. లక్షయిత్వైవ లుబ్ధేశాః కిఞ్చిద్రూపం భయాపహమ్,
మార్గణానాం ప్రవర్తన్తే క్షేపా యానపరాధినామ్. ౧౭

వ్యా.—లక్షయిత్వేతి. లుబ్ధేశాః లోభినః ప్రభవః మార్గణానా మర్థినాం భయాపహం భయం దారిద్ర్యాదిభయం అపహంతీతి తత్తథోక్తం రూపం సౌమ్య మాకారం స్వభావం వా కించి ల్లక్షయిత్వా దర్శయిత్వా, ఏవకారోఽవధారణే, అన పరాధినా మనపసరణశీలానాం అదుష్టానాంవా మార్గణానాం యాచకానాం క్షేపాయ నిరసనాయ ప్రవర్తన్తే ఉద్యుంజతే.

అన్యోఽప్యర్థః. లుబ్ధేశాః మృగయువశ్యాః. ని.'మృగయు ర్లుబ్ధకశ్చ స'ఇత్య మరః. భయాపహం కించిద్రూపం పత్రాదిసంఛన్నం లక్షయిత్వా దర్శయిత్వా, మృగే భ్య ఇతి శేషః. అనపరాధినాం లక్ష్యచ్ఛేదినాం మార్గణానాం శరాణాం. ని. 'కలంబ మార్గణశరా' ఇత్యమరః-క్షేపాయ మోచనాయ ప్రవర్తన్తే, మృగాన్ప్రతీతి శేషః.

టీ. లుబ్ధేశాః=లోభులగుదొరలు, మార్గణానాం=యాచకులయొక్క, భయాపహమ్=భయమునుబోఁగొట్టునట్టి, రూపం=సౌమ్యాకారమును, కిఞ్చిత్=కొంచెముగా, లక్షయిత్వైవ=చూపించియే, అనపరాధినామ్=అపరాధులుకానియట్టి, మార్గణానామ్= యాచకులయొక్క, క్షేపాయ=ఆక్షేపములకు, ప్రవర్తన్తే=ఉద్యమించుచున్నారు.

అర్థాంతరము. లుబ్ధేశాః=శ్రేష్ఠులైన వేఁటకాండ్రు, భయాపహామ్=భయమును బోఁగొట్టెడి, కిక్షిద్రూపమ్=అకులు మొదలగువానిచే కప్పఁబడిన తమయాకారమును, లక్షయిత్వా=కనఁబఱచి, అనపరాధినాం=లక్ష్యములను (గుఱిని) భేదించునట్టి, మార్గణానామ్=అంబులయొక్క, క్షేపాయ=విడుచుటకు, ప్రవర్తన్తే=తొడఁగెదరు.

తా. వేఁటకాండ్రగు బోయలు మృగములను జంపుటకై యాకులు మొదలగు వానిచేత తమయాకారమును మఱుగుపఱచి గుఱిపెట్టి మృగములకై యమ్ములనేయువిధమున లోభులగు రాజులు యాచకులభయము నపహరించునట్టి సుందరాకారమును గనఁబఱచి అపరాధులు కానట్టి యాచకుల నాక్షేపింతురు.

శ్లో. నీతో౽ప్యభ్యన్తరత్వేన జనైః ప్రాణసమానతామ్,
ఖలో వాయురివారూపో దుర్గ్రహః స్పర్శనం వినా. ౧౭

వ్యా.—నీతఇతి. అభ్యంతరత్వే నాంతర్వర్తిత్వేన హేతునా జనైస్సాధుభిః ప్రాణసమానతాం ప్రాణేన సమానతాం నీతో౽పి, ఆప్తత్వే నాంగీకృతో౽పీ త్యర్థః. ఖలో దుర్జనః స్పర్శనం వినా వితరణేన వినా అరూపః దుస్స్వభావో భవతి. కథంవాయురివ. సో౽పి జనైః ప్రాణిభిః ప్రాణతాం ప్రాణవాయుతాం సమానతాం సమానవాయుతాంచ నీతో౽పి అరూపోనీరూపః స్పర్శనం వినా స్పర్శనగుణం విహాయ దుర్గ్రహః గృహీతు మశక్యో భవతి. నీరూపస్పర్శవాన్ మరు దితి తార్కికపక్షః దుర్గ్రహ ఇతి 'ఈషత్స్వ' పీత్యాదినాఖల్ప్రత్యయః.

టీ. అభ్యన్తరత్వేన=లోపలనుండు కారణముచే, జనైః=సాధుజనులచేత, ప్రాణసమానతామ్ = ప్రాణములతో సమానభావమును, నీతో౽పి = పొందింపఁబడినవాఁడైనను, ఖలః=నీచుఁడు, స్పర్శనంవినా = దానమునువిడిచి, అరూపః=దుష్టస్వభావముగలవాఁడై, దుర్గ్రహః= తెలిసికొనఁదగనివాఁడుగ నున్నాఁడు.

అర్థాంతరము. అభ్యన్తరత్వేన = శరీరములోపలనుండు కారణముచే, జనైః = మనుష్యులచేత, ప్రాణసమానతాం=ప్రాణవాయువుయొక్కయు, సమానవాయువుయొక్కయు భావమును, నీతో౽పి=పొందింపఁబడినదియైనను, అరూపః=రూపములేనిదియై, స్పర్శనం వినా=స్పృశించుగుణమునువిడిచిన, వాయురివ=గాలివలెనే, దుర్గ్రహః=పట్టుటకుఁదగనివాఁడగుచున్నాఁడు.

తా. నీచుఁడగువాఁడు మిత్త్రునివలెనే లోఁబడినవాఁడై యుండుటచే సాధుజనులచేత ప్రాణములకుసమానముగా నెన్నఁబడినవాఁడైనను కొంచెమైనను దానగుణములేక శరీరములోప్రాణవాయువనియు సమానవాయువనియుఁ బేర్కొనంబడి రూపరహితమై స్పృశించుగుణములేని వాయువువలె గ్రహించుటకు యోగ్యుఁడుకాఁడు.

"రూపరహిత స్పర్శవాన్ వాయుః" అని యుండుటచే వాయువునకు రూపము లేకున్నను స్పర్శగుణము కలదు; దుర్జనునకు స్పర్శ (ఈవి) గుణములేనందున వాయువునకంటె దుర్గ్రిహుఁడనిభావము.

శ్లో. ప్రియార్థతృష్ణా మాపాద్య విప్రలమ్భేన ఖేదయన్,
వినాపి విగ్రహం లోకాన్ కామవ ద్బాధతే ఖలః.　　౧౭

వ్యా.—ప్రియార్థేతి. ఖలో దుర్జనః. 'పిశునో దుర్జనః ఖల' ఇత్యమరః. విగ్రహం వినాఽపి కలహేన వినాఽపి ప్రియార్థతృష్ణాం అభీష్టధనాదివాంఛాం ఆపాద్య జనయిత్వా విప్రలంభేన విసంవాదేన.ని. 'విప్రలంభో విసంవాద'ఇత్యమరః. అథవా విప్రలంభేన వంచనయా లోకాన్ సాధుజనాన్ ఖేదయన్ క్లేశయన్ బాధతే. కథం కామవత్ మన్మథ ఇవ. సోపి విగ్రహం వినా స్వయ మశరీరోఽపి ప్రియార్థతృష్ణాం ప్రియతమాప్రయోజనాకాంక్షాం ఆపాద్య విప్రలంభేన విరహేణ ఖేదయ న్సంతాపయన్ లోకాన్ కాముకజనాన్ బాధతే.

టీ. ఖలః=నీచుఁడు, విగ్రహంవినా = కలహములేకున్నను, ప్రియార్థతృష్ణాం= ఇష్టమైన ధనాశను, ఆపాద్య=కలిగింపఁజేసి, విప్రలమ్భేన = విపరీతముగా పలుకుట చేత, లేక వంచనచేత, లోకాన్=జనులను, ఖేదయన్ = దుఃఖమునొందింపఁజేసెడి, కామవత్=కోర్కిగలవానివలె, బాధతే=పీడించుచున్నాఁడు.

అర్థాంతరము. విగ్రహంవినా = శరీరమునువిడిచి, ప్రియార్థతృష్ణాం-ప్రియా= ప్రియురాలియొక్క, అర్థ=ప్రయోజనముయొక్క, తృష్ణాం=అభిలాషను, ఆపాద్య = కలుగఁజేసి, విప్రలమ్భేన=వియోగముచేత, లోకాన్=కాముకజనులను, ఖేదయన్= గాసిపఱచుచుండెడి, కామవత్ = మన్మథునివలె, బాధతే = సాధుజనులను బాధించుచున్నాఁడు.

తా. దుష్టుఁడగువాఁడు కలహింపకయుండియు,ఇష్టమైనధనాదులందాశగలుగఁజేసి వ్యత్యాసముగా పలుకుటచేతగాని వంచనచేతగాని సాధుజనులను, శరీరములేక ప్రియురాండ్రయం దాశగలిగించి యట్టిప్రియాంగనలను విడిచియున్న కాలమున కాముకజనులను బాధపఱచుకామునింబోలి బాధించుచున్నాఁడు.

శ్లో. పురుషా వివరం ప్రాప్య కేఽప్యలక్షితసంభవాః,
దూషయన్తి మహావంశాన్ ముఖే తీక్ష్ణా ఘుణా ఇవ.　　౧౮

వ్యా.—పురుషాఇతి. అలక్షితః అజ్ఞాతః సంభవః ఉత్పత్తిస్థానం యేషాం తే తథోక్తాః. అకులీనా ఇత్యర్థః. కేఽపి పురుషాః వివరం ఛిద్రం, దోషలేశ మిత్యర్థః.

తత్సా)ప్యాభిగమ్య, దృష్ట్వేతి యావత్. మహావంశాన్ కులీనాన్ కులేషు ఘునాన్ ముఖే తీక్ష్ణాః కటుతరవచనా స్సంతః దూషయంతి నిందంతి. కథం? ఘుణా ఇవ ఘుణ విశేషా ఇవ. తేఽపి అలక్షితసంభవా అజ్ఞాతజన్మానః ముఖే తీక్ష్ణాః నిశితముఖాః వివరం ఛిద్రం ప్రాప్య మహావంశాన్ మహతో వేణూన్ దూషయంతి వ్యర్థయంతి. వేణూ నాం దూషణం నామ గృహాదికర్మ స్వనర్హత్వం.

టీ. అలక్షితసమ్భవాః - అలక్షిత=తెలియని, సంభవాః=పుట్టుకగల, కేఽపి= కొందరైన, పురుషాః=మనుష్యులు, వివరం=రంధ్రమును(అనఁగా దోషసమయమును), ప్రాప్య=పొంది (చూచి), మహావంశాన్=గొప్పకులమందుఁ బుట్టినవారిని, ముఖే=మొగమునందు, తీక్ష్ణాస్సంతః = పరుషవచనములు గలవారగుచు, దూషయన్తి = మానము పోఁగొట్టెదరు.

అర్థాంతరము. అలక్షితసంభవాః=తెలియఁబడనిపుట్టుకగల, ముఖే=మొగమందు, తీక్ష్ణాః=కాఠిన్యముగల, వివరం=రంధ్రమును, ప్రాప్య=పొంది, మహావంశాన్=పెద్ద వెదుళ్ళను, ఘుణా ఇవ=కట్టెలలోని పురుగులవలె, దూషయన్తి=చెఱచుచున్నారు.

తా. ఇట్టివంశమునందుఁ బుట్టినవారని తెలియుటకుగాకయుండు కొందఱు దుష్టులు మంచికులమందుఁబుట్టిన గొప్పవారని సమయముగనిపెట్టి వెదుళ్ళలోనుండు పురుగులెట్లు గూఢముగాపుట్టి రంధ్రములవలన మెల్లఁగా లోపలఁబ్రవేశించి వాడిగలముఖములుగలవియై యావెదుళ్లను చెఱుచుచున్నవో, అవ్విధమున గొప్పవారిని పరుషవచనములచేత నిందించుచున్నారు.

శ్లో. అదాక్షిణ్యా దతీ వోగ్రాః పవనా ఇవ దుర్జనాః,
గురూనపి ప్రతిక్షేప్తుం ప్రయతన్తే క్షమాభృతః. ౨౦

వ్యా.—అదాక్షిణ్యాదితి. దుర్జనాః దక్షిణ స్సరళః,ఋజు రితి యావత్ తస్య భావో దాక్షిణ్యం. ని. 'దక్షిణ స్సరళోదారపరచ్ఛందాను వర్తిష్వి'తి విశ్వః. తదభావాద్ధేతోః అతీ వాత్యంతం ఉగ్రా ఆసహ్యాః క్షమాభృతః క్షమా శాలినః గురూ నపి ఆచార్యా నపి ప్రతిక్షేప్తుం నిందితుం ప్రయన్తే. క్రుద్ధో హన్యా ద్గురూనపీ'తి న్యాయః. దక్షిణః ఖలు పవమానో మృదు ర్వాతి తదభావాత్ గురూన్ బృహతః క్షమాభృతః పర్వతా నపి ప్రతిక్షేప్తు మున్మూలయితుం ప్రయతన్తే.

టీ. దుర్జనాః=నీచులు, అదాక్షిణ్యాత్=సరళభావములేనందున, అతీవ=మిక్కిలి, ఉగ్రాః=కోపముగలవారై, క్షమాభృతః = శాంతమునువహించియుండు, గురూనపి= గురువులనుకూడ, ప్రతిక్షేప్తుం=ఆక్షేపించుటకు, ప్రయతన్తే=ప్రయత్నించుచున్నారు.

అర్థాంతరము. అదాక్షిణ్యాత్=దక్షిణదిక్కునందు పుట్టకుండుటవలన, ఉగ్రాః =సహించుటకుశక్యముగాకయుండు, గురూన్=గొప్పవైన, క్షమాభృతః=భూధరములను (కొండను), ప్రతిక్షేప్తుం=కదలించుటకు సమర్థములైన, పవనా ఇవ=వాయువులవలెనే ప్రయతన్తే=ప్రయత్నించుచున్నారు.

తా. దక్షిణదిశయందుపుట్టక పెద్దకొండలనుకూడ పెర్లించుటకు సమర్థములైన, వాయువులవలె, చక్కనిస్వభావములేక కోపముగలిగిన దుష్టులు గొప్పవారగు నాచార్యులనుకూడ నిందింతురు.

శ్లో. దుర్జ్ఞానైశ్చ ద్విరేఫైశ్చ మలినై స్సుమనోగణః,
ఆత్తగన్ధోఽపి సహజం మార్దవం న విముఞ్చతి. ౨౧

వ్యా.—దుర్జ్ఞానైరితి. మలినైః పాపేన మలీమసైః, 'జ్యోత్స్నా తమిస్రే' త్యాదినా మలినశబ్ద స్సాధుః. దుర్జ్ఞానైః దుష్టజ్ఞానైః, అథవా దుశ్శబ్దః ఈషదర్థే, కించిజ్జ్ఞానైః పురుషైః ఆత్తగంధోఽపి తిరస్కృతోఽపి. ని. 'ఆత్తగంధోఽభిభూత స్స్యా' దిత్యమరః, సుమనోగణః విద్వత్సమూహః సహజం స్వాభావికం మార్దవం మృదుచిత్తతాం, కృపాళుతామితి యావత్ న విముంచతి న త్యజతి. మలినై ర్నీలై ర్ద్విరేఫైః, ద్వౌ రేఫౌ భ్రమరశబ్దగతౌ యేషాం త ఇతి శబ్దధర్మే ణార్థస్య వ్యపదేశః, భృంగై రాత్తగంధోఽపి స్వీకృతపరిమళోఽపి సుమనోగణః పుష్పనికరః సహజం నైజంమార్దవం నఖచ్ఛేద్యతాం న విముంచతి. తత్తస్య స్వాభావికో గుణః.

టీ. మలినైః=పాపముచే దూషింపఁబడిన, దుర్జ్ఞానైః=తెలివిలేని, లేక కొంచెము తెలివిగలపురుషులచేత, ఆత్తగన్ధోఽపి=తిరస్కృతుఁడైనను,('ఆత్తగన్ధస్తిరస్కృతః' అని అమరము.) సుమనోగణః=విద్వాంసులసముదాయము, సహజం=కూడఁబుట్టినట్టి, మార్దవం=మెత్తనిభావమును (దయను), నవిముఞ్చతి=విడువదు.

అర్థాంతరము. మలినైః=నల్లనైనట్టి, ద్విరేఫైః=తుమ్మెదలచేత, ఆత్తగన్ధోఽపి-ఆత్త=స్వీకరింపఁబడిన, గన్ధోఽపి = పరిమళముగలదియైనను, సుమనోగణః = పూవులసముదాయము, సహజం=తనంతటనేగలిగిన, మార్దవం=మెత్తనిదనమును, నవిముఞ్చతి=విడువదు.

తా. తుమ్మెదలచేత గ్రహింపఁబడిన పరిమళముగలదిగ్గైనను, పుష్పము లెవ్విధమున తనమృదుభావమును విడువదో యవ్విధమున పండితుఁడగువాఁడు పాపులగు దుర్జనులచే తిరస్కృతుఁడైనను తన సాధుత్వమును విడువఁడు.

శ్లో. గమ్భీరం చ ప్రసన్నం చ ధనినో మానసం మహత్,
ద్విజానా ముపకారాయ శుచీనాం కేన నిర్మితమ్. ౨౨

వ్యా.—గంభీరమితి. గంభీరం - గాంభీర్యవచ్చాపలాది దోషరహితమిత్యర్థః. ప్రసన్నం క్రోధాదివిరహితం అతఏవ మహత్ అనుపమానం ధనినో ధనవతః పురుషస్య సంబంధి మానసం మనః - ప్రజ్ఞాదిపాఠా న్మనశ్శబ్దస్య స్వార్థేణ్ ప్రత్యయః, శుచీనాం మనః కర్మభ్యాం శుద్ధానాం ద్విజానాం విప్రాణాం ఉపకారాయ దానలక్షణాయ కేన పురుషేణ. యద్వా కేన బ్రహ్మణా నిర్మితం సృష్టం. ని. 'కో బ్రహ్మాత్మానిలార్కేష్వి'తి విశ్వః. పాత్రవ్యయస్య దుర్లభత్వా దితి భావః.

అన్యోఽప్యర్థః. ధనినః కుబేరస్య సంబంధి గంభీరంపూర్ణం, అగాధ మితి యావత్. ని. 'నిమ్నం గభీరం గంభీర ముత్తానం తద్విపర్యయే' ఇత్యమరః. ప్రసన్నం వర్షాద్యకలుషం మహ ద్విశాలం మానసం మానసాఖ్యం సరః శుచీనాం శుభ్రాణాం ద్విజానాం పక్షిణాంహంసానా మితి యావత్. ని. 'దంతవిప్రాండజాద్విజాః, శుక్ల శుభ్ర శుచి శ్వేతే' త్యుభయత్రా ప్యమరః. ఉపకారాయ ఆశ్రయలక్షణాయ కేన వా పురుషేణ బ్రహ్మణావా నిర్మితం - వర్షాసు హంసాః ఖలు మానసే వసంతి.

టీ. గమ్భీరం = చపలాదిదోషములేనిదియు, ప్రసన్నం = కోపములేనిదియు, మహత్ = సమానములేనిదియునగు, ధనినః=ధనవంతులయొక్క, మానసం = మనస్సు, శుచీనాం=మనసుచేతను కృత్యముచేతను బరిశుద్ధులైన,ద్విజానాం=బ్రాహ్మణులయొక్క, ఉపకారాయ=దానలక్షణమైన యుపకారముకొఱకు, కేన=ఏపురుషునిచే (లేక బ్రహ్మచేత), నిర్మితం = చేయఁబడెను? ('కో బ్రహ్మానిలార్కేషు'. అని అ.) అనఁగా తనంతన గల్గినదని భావము.

అర్థాంతరము. ధనినః=కుబేరునియొక్క, గమ్భీరం=సంపూర్ణమైన, ప్రసన్నం =నిర్మలమైన,మహత్ =విశాలమైన, మానసం=మానససరోవరము, శుచీనాం=తెల్లనైనట్టి, ద్విజానాం=పక్షులయొక్క, అనఁగా హంసలయొక్క, ఉపకారాయ =ఆశ్రయలక్షణమైన యుపకారముకొఱకు, కేన=ఏపురుషునిచేత, (అథవా బ్రహ్మచేత,) నిర్మితం = నిర్మింపఁబడెను?

తా. ఎపుడు నిండియుండుటచే మిక్కిలి లోతుగలిగి నిడివిగలదియై తేటయగు నీటిచే మేటియై కుబేరసంబంధమై తెల్లనిపక్షులైన యంచల కుపకారమైయుండు మానససరోవరమువలె చాంచల్యాదిదోషరహితమై యసదృశమై పరిశుద్ధులైన బ్రాహ్మణుల కుపకారమైన ధనవంతులమనస్సు ఏపురుషునిచేతనిర్మింపఁబడెనో యనుట. ఇచట (క) అను శబ్దము బ్రహ్మకు పేరగుటచే ఏబ్రహ్మచే నిర్మింపఁబడెనోయనియును జెప్పవచ్చును. ద్విజశబ్దము పక్షికిని బ్రాహ్మణునకును పేరగును. అంచలు మానససరోవరమందు వర్షాకాలమున వసించుట యనునది కవిసమయసిద్ధము. ౨౨

శ్లో. గుణినో వృత్తవిమలా మహావంశప్రసూతయః,
ముక్తామయాః ప్రకాశంతే నరాః హారా ఇవోజ్జ్వలాః. ౨౩

వ్యా.—గుణిన ఇతి. గుణినః గుణాః వినయాదిగుణాః తైస్సంపన్నాః వృత్తం చరిత్రం - సదాచార ఇతియావత్ - తేన విమలాః పూతాః మహావంశప్రసూతయః సత్కులోద్భూతాః నరాః ముక్తామయాః వ్యాధిరహితాః అతఏవోఽజ్జ్వలాః విరాజమానదేహాః స్సంతః ప్రకాశంతే అధికం శోభంతే - కథం? హారా ఇవ ముక్తాదామనీవ. తేఽపి గుణినః తంతుమంతః-సూత్రప్రోతా ఇత్యర్థః - వృత్తా శ్చతే విమలా శ్చతే తథోక్తాః - వర్తులా నిర్మలా శ్చేత్యర్థః - మహావంశప్రసూతయః మహావేణుసంభూతాః - తదుక్తం. "కరీంద్రజీమూతవరాహశంఖమత్స్యాహిశుక్త్యుద్భవవేణుజాని, ముక్తాఫలాని ప్రథితాని లోకే తేషాం చ శుక్త్యుద్భవ మేవభూరీ" తి-ముక్తామయాః మౌక్తికప్రచురాః అత ఏవోఽజ్జ్వలా స్సంతః ప్రకాశంతే.

టీ.గుణినః=వినయాదిగుణములుగలయట్టియు, వృత్తవిమలాః-వృత్త=మంచియాచారముచేత, విమలాః=పరిశుద్ధులైనట్టియు, మహావంశప్రసూతయః-మహావంశ=గొప్పకులమందు, ప్రసూతయః=పుట్టుకగలిగినట్టియు, ముక్తామయోజ్జ్వలాః-ముక్త=విడువఁబడినట్టియు, ఆమయ = రోగములేనట్టియు, నరాః=మనుజులు, ఉజ్జ్వలాః=మిక్కిలి ప్రకాశముగా, ప్రకాశంతే=తేజరిల్లుచున్నారు.

అర్థాంతరము. గుణినః=సూత్రములుగలట్టియు, వృత్తవిమలాః=గుండ్రములును నిర్మలములునైనట్టియు, మహావంశప్రసూతయః - మహావంశ = గొప్పవెదుళ్లయందు, ప్రసూతయః=పుట్టుకగలట్టియు, ('కరీంద్రజీమూతవరాహశంఖమత్స్యాహిశుక్త్యుద్భవవేణుజాని, ముక్తాఫలాని ప్రథితాని లోకే తేషాంచ శుక్త్యుద్భవమేవ భూరి' అనుటచే వెదుళ్ళయందు ముత్తెములుపుట్టుట ప్రసిద్ధము.)ముక్తామయోజ్జ్వలాః=మిక్కిలి ప్రకా

శించుచుండెడి ముత్యములయొక్క, హారాఇవ = సరములవలె, ప్రకాశంతే = వెల్గు చున్నారు.

తా. మంచిగుణములును సదాచారమును పరిశుద్ధత్వమును గొప్పవంశమునం దుద్భవమును రోగరాహిత్యమునుగల మనుష్యులు, దారములయందు గుచ్చ్రముఁ తేట యును పెద్దవెదుళ్లయందు జన్మమును ముక్తాఫలప్రాచుర్యమునుగల కంఠసరములను బోలి పొలుచుచున్నారు.

శ్లో. సాధుసంతానభాజో యే సంత స్సంశ్రితనన్దనాః,
న తే ముఞ్చన్తి పఞ్చత్వే ప్యౌదార్యం స్వర్ద్రుమా ఇవ. ౨౮

వ్యా.—సాధ్వితి. సాధు ప్రశస్తం సంతానం కులం భజంతీతి సాధుసంతాన భాజః సత్కులోద్భూతాః - అథవా సాధుసంతానభాజః - సత్పుత్రభాజః భజోణ్విరి తి ణ్విప్రత్యయః-అత ఏవ సంశ్రితనందనాః ఆశ్రితసంతోషాః.- నిత్యం సంతుష్టా ఇతి యావత్ - యేసంతః సజ్జనా స్సంతి - తే సంతః పంచత్వే అత్యయే - మరణకాల ఇతి యావత్. ని. "స్యాత్పంచతా కాలధర్మోదిష్టాంతః ప్రళయో త్యయ"ఇత్యమరః. ఔదా ర్యం మహత్వంవా. ని. "ఉదారో దాతృమహతో" రిత్యమరః - న ముంచంతి న త్య జంతి-అమోచనస్య నిఖిలప్రాముఖ్యహేతుత్వా దితి భావః - కథం? స్వర్ద్రుమా ఇవ దేవ తరవ ఇవ. తేపి సాధు ప్రశస్తం సంతానం సంతానాఖ్యం తే వ్వన్యతమం తరుం భ జంతీ తే తథోక్తాః. సంతానాఖ్యతరు సహితా ఇ త్యర్థః-సంశ్రితనందనాః ఆశ్రితనంద నాఖ్యవనాః తే స్వర్ద్రుమాః పంచానాం పంచసంఖ్యాకానాం భావః పంచత్వం తస్మి న్నపి-స్వయంపంచా పీత్యర్థః - ఔదార్యం అభిలషితార్థప్రదత్వం న ముంచంతీతి - త త్తేషాం స్వాభావికో గుణ ఇతి భావః.

టీ. సాధుసంతానభాజః - సాధు = ప్రశస్తమైన, సంతాన=కులమును (లేక పుత్రులను), భాజః=పొందినవారు, కనుకనే, సంశ్రితనన్దనాః - సంశ్రిత=పొందఁబడి నట్టి, నందనాః=సంతసముగల, యే=ఏసత్పురుషులుగలరో, తే=వారలు, పఞ్చత్వేపి= మరణసమయమునందైనను, ఔదార్యం = దాతృత్వమును (అథవా గొప్పతనమును), న ముఞ్చన్తి=విడువరు.

అర్థాంతరము. సాధుసంతానభాజః-సాధు=ఎన్నఁదగిన, సంతాన=సంతానమను పేరుగల దేవవృక్షమును, భాజః=పొందినట్టియు, సంశ్రితనన్దనాః=ఆశ్రయింపఁబడిన నందనోద్యానముగలట్టియు, యే=ఏకల్పవృక్షములుగలవో, పఞ్చత్వేఽపి=పఞ్చసంఖ్యా త్వమందును, ఔదార్యం=దాతృభావమును. నముఞ్చన్తి=విడువవో, తే=అట్టి, స్వర్ద్రుమా

ఇవ=కల్పవృక్షములవలె (సాధుసంతానాది గుణములుగల సత్పురుషులు) న ముఞ్చన్తి= విడువరు.

తా. సంతానమనుపేరుగల వృక్షమునుబొంది దేవేంద్రుని నందనోద్యానమం దుండు అయిదు కల్పవృక్షములనుఁబోలె సత్పురుషులు పొగడఁదగిన కులముగలవారై యెల్లపుడు సంతోషించుచు తమయంత్యకాలమందైనను, అనఁగా కష్టకాలమందుకూడ, తమ గౌరవమైన దాతృభావమును విడువరు. ౨౮

శ్లో. స్వయం ఛేద ముపేత్యాపి పరా నామోదయ న్తి యే,
భద్రశ్రియస్తే జాయన్తే స్వగోత్రస్య ప్రసిద్ధయే. ౨౯

వ్యా.—స్వయ మితి. యే పురుషాః స్వయం ఛేదం నాశం ఉపేత్యాపి-ప్రాప్యాపి ఇతి శేషః - పరా నన్యా నామోదయంతి తే పురుషాః భద్రశ్రియః ప్రశస్తసంపదో జాయంతే-కించ స్వగోత్రస్య స్వకులస్య ప్రసిద్ధయే ఖ్యాతయే చ భవంతి.

అన్యోప్యర్థః. యే తరవః ఛేదం క్షోభం క్షోదత్వం వా ఉపేత్యాపి పరా నామోదయంతి ఆమోదవతః కుర్వంతి-అతిసౌరభవతః కుర్వంతీతి యావత్ - ఆమోద శబ్దా త్తత్కరోతీతిణ్యం తా ల్లట్-తే భద్రశ్రియః చందనతరవః. ని. "భద్రశ్రీశ్చం దనో స్త్రియా" మిత్యమరః-స్వగోత్రస్య మలయాచలస్య ప్రసిద్ధయే జాయంతే సమ ద్యంతే. ని. "గోత్రం నామ్ని కులేచల" ఇతి విశ్వః.

టీ. యే=ఏనరులు, స్వయం=తాము, ఛేదం=నాశమును, ఉపేత్యాపి = పరుల వలనఁబొందిరైనను, పరాన్=ఇతరులను, ఆమోదయన్తి=సంతసింపఁజేయుదురో, తే= అట్టిపురుషులు, భద్రశ్రియః = మంచిసంపత్తుగలవారగుటయేకాక, స్వగోత్రస్య=తమ కులముయొక్క, ప్రసిద్ధయే=ప్రఖ్యాతికొఱకు, జాయన్తే=పుట్టుచున్నారు.

అర్థాంతరము. యే = ఏవృక్షములు, స్వయం=తాము, ఛేదం = నమసిపోవుట ను, ఉపేత్యాపి = పొందినప్పటికిని, పరాన్=ఇతరులను, ఆమోదయన్తి = సువాసన గలవారినిగాఁజేయుచున్నవో, తే=అట్టి, భద్రశ్రియః=గంధపుమ్రాఁకులు, స్వగోత్రస్య= స్వ=తమ, గోత్రస్య=పర్వతమైన మలయముయొక్క, ప్రసిద్ధయే=ప్రఖ్యాతికొఱకు, జాయన్తే=కలుగుచున్నవి.

తా. గంధపుమ్రాఁకులు నరులచే నరుకబడి సానరాలయందు నూరుటచే నమసి పోవుచున్నవైనను పరులకెన్విధమున పరిమళమును గలుగఁజేయుచు తమ పుట్టినస్థలమగు మలయపర్వతమునకు ప్రసిద్ధి గల్గించుచున్నవో యాలీరున సత్పురుషులగువారు తమకు కష్టము గలిగినప్పటికిని పరులను సంతసింపఁజేయుచుండుటవలన, సంపత్తుగలవారై తమ

వంశమునకుఁ బ్రఖ్యాతిని గలుగఁజేయుదురు. గంధపుమ్రాఁకులు అంతటఁగలిగి యుండి నను మలయపర్వతమునందే ప్రసిద్ధి యగుట కవిసమయ సిద్ధము.

ఇట్టి మలయాచలములు నాలుగున్నవనియు, అందు ఏలకులు, లవంగములు, జాజికాయలు, మిరియములు, శ్రీగంధవృక్షములుగలది యొకటియనియు, పగడపుమ్రాఁకులు, ముత్యములు, రత్నములగనులు, కర్పూరకదళికలుగలిగి యగస్త్యమునికియునికిపట్టై సమీపమున తామ్రపర్ణీనదిగలిగి సింహములకు స్థానమైనది రెండవదియనియు, దేవతలకు స్థానమై, జనులకు రోగకరమై, యెపుడును ఫలపుష్పములుగలది మూఁడవదనియు, బంగరుకోటలుగలిగి రత్నఖచితములైన మందిరములచే నొప్పివాకిటిగెడమ్రాఁకులందు దేవేంద్రచిత్రితములై రావణాసురునకు స్థానమై కోకిలాలాపసుందరంబై చల్లనిగాలి యెల్లదిక్కులకు గలిగించి లంకయనంబరఁగినది నాలవ మలయ మనియు, అలంకారశాస్త్రంబులందుఁ గనందగు.

శ్లో. కర్ణలక్ష్మీగుణోత్కర్షా వదాన్యా ధన్వినో యథా,
నిష్ఫలాన్ న విముఞ్చన్తి మార్గణాన్ సంగరే స్థితాః. ౨౬

వ్యా.—కర్ణేతి. కర్ణలంఘిగుణోత్కర్షాః శ్రవణప్రాపి వినయాధిక్యాః వదాన్యాః బహుప్రదాః పురుషాః. ని. "స్యుర్వదాన్యస్థూలలక్షదానశౌండాబహుప్రద" ఇత్యమరః. సంగరే ప్రతిజ్ఞాయాం స్థితాః కృతప్రతిజ్ఞా ఇత్యర్థః. ని. "ప్రతిజ్ఞాజిసంవిదాపత్సు సంగర" ఇత్యమరః-మార్గణాన్ అర్థిజనాన్ నిష్ఫలాన్ నిర్ధనాన్ న విముంచంతి న ప్రేషయంతి-కథం, ధన్వినో యథా ధానుష్కా ఇవ-యథా శబ్ద స్సాదృశ్యవాచకశబ్ద పర్యాయ ఇతిదండీ. తేఽపి కర్ణలంఘిగుణోత్కర్షాః ఆకర్ణాకృష్టమౌర్వీకాః సంగరేయుద్ధే స్థితాః మార్గణాన్ బాణాన్ నిష్ఫలాన్ నిశ్శల్యాన్ న విముంచతి - నిశ్శల్య శరమోచనస్యాకించిత్కరత్వాదితి భావః.

టీ. కర్ణలక్ష్మీగుణోత్కర్షాః - కర్ణ=చెవిని, లక్ష్మీ=పొందుచుండెడి, గుణ = వినయాదిసుగుణములయొక్క,ఉత్కర్షాః=గొప్పతనముగల, (లేక రాధేయునిమీఱిన దానగుణాధికు లైన), వదాన్యాః=దాతలైనపురుషులు, సంగరే=సత్యమైన ప్రతిజ్ఞయందు, స్థితాః=ఉన్నవారై, నిష్ఫలాన్ = పేదలైన, మార్గణాన్=యాచకజనులను, న విముఞ్చన్తి=విడువరు.

అర్థాంతరము. కర్ణలక్ష్మీగుణోత్కర్షాః = చెవినిదాఁటుచుండు అల్లెత్రాటియొక్క మిక్కుటముగల, సంగరే=యుద్ధమందు, మార్గణాన్ = బాణములను, నిష్ఫలాన్=అలు

గులులేనివానిని, ధన్వినో యథా=విలుకాండ్రవలె, (వినయాది సుగుణములుగల దాతలైనపురుషులు) న విముఞ్చన్తి=విడువరు.

తా. దాతలందు ప్రసిద్ధుఁడైన కర్ణునిమీాఱుచుండెడి గుణాధిక్యముగలిగి సత్యప్రతిజ్ఞ గలిగిన దాతలు చెవివఱకు నీడ్వఁబడి యల్లెత్రాడుగలిగిన విలుకాండ్రు ఆలుగులులేని బాణముల నెవ్విధమున విడువరో, యట్లు పేదలగువారిని చే విడువరు. ౨౩

శ్లో. ముఞ్చన్తశ్చాపలరుచిం యే స్థితాః పావనే పథి,
ఘనా ఇవార్ద్రహృదయాః ప్రథన్తే తేదిగన్తరే. ౨౪

వ్యా.—ముంచంతఇతి. యే పురుషాః చాపలేరుచి మిచ్ఛాం ముంచంతః-చాపలదోషరహితా ఇత్యర్థః-పావనే శుద్ధే పథి స్థితాః-సదాచారనిష్ఠా ఇత్యర్థః- ఆర్ద్రం కృపారసభరితం హృదయం మనః యేషాంతే తథోక్తాః ఏవం విధాస్తేపురుషాః దిగంతరే ప్రథంతే ప్రఖ్యాతా భవంతి-కథం? ఘనాః జీమూతా ఇవ. తేఽపి చాపలాం వైద్యుతీంరుచిం కాంతిం ముంచంతః. ని. 'తటిత్సౌదామినీ విద్యుచ్చంచలా చపలాపిచే' త్యమరః-పావనే మారుతే పథి గగనే స్థితాః ఆర్ద్రహృదయాః-జలభరితా ఇత్యర్థః-దిగంతరే-ఏకవచన మతంత్రం, దిగంతరేషు ప్రథంతే వ్యాప్నువంతి-వర్షాస్వితి శేషః.

టీ. యే=ఏపురుషులు, చాపలే=చపలదోషమందు, రుచిం=ప్రీతిని, ముఞ్చన్తః=విడిచినవారై, పావనే=పరిశుద్ధమైన, పథి=మార్గమందు, స్థితాః=ఉన్నవారై, ఆర్ద్రహృదయాః-ఆర్ద్ర=దయచే మెత్తనైన, హృదయాః = మనస్సుగలవారలో, తే=వారలు, దిగన్తరే=దిశలయందు, ప్రథంతే=కీర్తనీయు లగుచున్నారు.

అర్థాంతరము. చాపలరుచిం = మెఱుపుతీవెలమించును, ముఞ్చన్తః = పుట్టించుచుండునట్టియు, పావనే=గాలిసంబంధమైన, పథి=మార్గమందు (అనఁగా, ఆకాశమార్గమందు) స్థితాః=ఉన్నట్టియు, ఆర్ద్రహృదయాః = నీటిచేఁదడిసినవియైన, ఘనా ఇవ=మేఘములవలె, దిగన్తరే=దిక్కులందు, (చపలచిత్తులుగాని పరిశుద్ధకరుణార్ద్రహృదయులు) ప్రథన్తే=ప్రఖ్యాతులగుచున్నారు.

తా. చాంచల్యదోషమునువిడిచి పవిత్రమైనవృత్తియందుండు దయావంతులగు పురుషులు మెఱుపుతీవెలను వెలిబఱుచుచు వాయుమార్గమగు మింట వసించి జలభరితమైన హృదయముగల మేఘములవలెనే దిక్కులందు ప్రసిద్ధిని బొందుచున్నారు. ౨౪

శ్లో. ఉదయం ప్రాప్య తీక్ష్ణత్వాద్ధుష్ప్రేక్షత్వ మువేయుషః,
పాదాన్తికే వసుమతో సహిమానీ నిషీదతి. ౨౫

వ్యా.—ఉదయ మితి. మానీ అభిమానీ పురుషః కర్తా ఉదయ మైశ్వర్యలక్షణం

ప్రాప్యాభిగమ్య తీక్ష్ణత్వాత్ క్రూరత్వా ద్ధేతోః దుష్ప్రేక్ష్యత్వం ద్రష్టుమశక్యత్వం ఉపేయుషః ప్రాప్తవతః వసుమతః ధనవతః. ని. "వసుర్మయూఖాగ్ని ధనాది ష్వి"తి విశ్వః-పాదాంతికే చరణసమీపే న నిషీదతి నోపవిశతి-మానధనయో ర్మానస్య దుస్త్యజత్వాదితిభావః.

అన్యోప్యర్థః. ఉదయ ముదయాచలం ప్రాప్య తీక్ష్ణత్వా త్తీక్ష్ణకరత్వా ద్ధేతోః దుష్ప్రేక్ష్యత్వం ద్రష్టు మశక్యత్వం ఉపేయుషః వసుమతః భానుమతః-సూర్యస్యేత్యర్థః-పాదాంతికే కిరణసమీపే. ని. "పాదారశ్మ్యంఘ్రితుర్యాం శా"ఇత్యమరః. హిమాని హిమసంహతిః కర్త్రీ-ఇంద్రవరుణే త్యాదినా జీష్ ప్రత్యయః ఆనుగాగమశ్చ - ననిషీదతి నతిష్ఠతి-ఉదితే సూర్యే హిమం నశ్యతీత్యర్థః.

టీ. మానీ=అభిమానముగల పురుషుఁడు, ఉదయం = ఔన్నత్యమును, ప్రాప్య= పొంది, తీక్ష్ణత్వాత్=క్రూరుఁడైయుండుటవలన, దుష్ప్రేక్ష్యత్వం = చూచుటకుఁగాని భావమును, ఉపేయుషః=పొందినట్టి, వసుమతః = ధనవంతునియొక్క, పాదాన్తికే = చరణసమీపమందు, నహి నిషీదతి=ఉండఁడు.

అర్థాంతరము. ఉదయం = పూర్వపర్వతమును, ప్రాప్య=పొంది, తీక్ష్ణత్వాత్= వేఁడిగానుండుటవలన, దుష్ప్రేక్ష్యత్వం=చూచుట కసాధ్యత్వమును, ఉపేయుషః = పొందినట్టి, వసుమతః=కిరణములుగల సూర్యునియొక్క, పాదాన్తికే=కిరణములదగ్గర, హిమానీ=మంచుగుంపు, ననిషీదతి=ఉండదు.

తా. ఉదయపర్వతమునుబొంది మిక్కిలి వేఁడిమిగల కిరణములుగల సూర్యుని సమీపమం దెవ్విధమున మంచు నిలువదో అట్లు అధికైశ్వర్యముగలిగి క్రూరుఁడై చూచుటకసాధ్యుఁడైన ధనవంతుని సమీపమందు మానవంతుఁడైన పురుషుఁడు నిలువఁడు. ఐశ్వర్యగర్వితుఁడైన వానియొద్ద అభిమానము గలవాఁడు సూర్యునియొద్ద మంచునిలువని యట్లు నిలువఁడనిభావము.

శ్లో. ఆసాద్య మన్దరాగోఽపి భుజఙ్గే నాతిసఙ్గమమ్,
తద్భోగాత్తు భ్రమ న్కష్టం ప్రాప్నోతి విషమం తతః. ౨౯

వ్యా.—ఆసాద్యేతి. మందో రాగో యస్య స తథోక్తః - విరక్తోపీత్యర్థః-భుజంగేన విటేన సహ. ని. "వేశ్యాపతిర్భుజంగస్స్యాత్షిద్గఃపల్లవికోవిట" ఇత్యమరః. అతి-సంగం అత్యంతసంబంధం ప్రాప్యతస్య విటస్య భోగాద్విషయానుభవాత్ భ్రమన్ ఏవ మాచరణీయ మితి భ్రాంత స్సన్ తతః భ్రమణానంతరం విషమం దుస్సహం కష్టం కృఛ్రం - నరకాదిక్లేశ మితి యావత్-ప్రాప్నోతి-వినశ్యతి యతొర్దుస్సంగా దితి భావః.

అన్యోఽప్యర్థః. తతః విస్తృతః-ఉన్నత ఇత్యర్థః-మందర ఇత్యగః మందరపర్వతః. ని. 'శైలవృక్షౌనగావగా" విత్యమరః-భుజంగేన వాసుకినా అతిసంగమం వేష్టనం ఆసాద్య-క్షీరోదధిమథనసమయ ఇతి భావః-తస్య భోగాత్ కాయాత్. ని. "భోగస్సుఖేస్త్ర్యాదిభృతావప్యహేశ్చ ఫణకాయయో"రిత్యమరః. భ్రమన్ ఘూర్ణమానః కష్టం గహనం-కృచ్ఛ్రగహనయోః కషఇటీట్ ప్రతిషేధః - విషమం పాతాళరూపం గహనం ప్రాప్నోతి-అత్ర లణ్నిర్దేశో తంత్రః-ప్రాప్త ఇత్యర్థః-అబ్ధిమథనకాలే మందరః పాతాళం ప్రావిశదితి పురాణోక్తిః.

టీ. మన్దరాగోఽపి-మన్ద=కొంచెమైన, రాగోఽపి=విశ్వాసముగలవాఁడైనను, భుజఙ్గేన=విటునితోడ, అతిసంగమం=మిక్కిలిసంబంధమును, ఆసాద్య=పొంది, తద్భోగాత్-తత్=ఆవిటునియొక్క, భోగాత్ = విషయానుభవమువలన, భ్రమన్=భ్రాంతిగలవాఁడై, తతః = అనంతరమందు, విషమం = అసహ్యమైన, కష్టం = నరకాదిదుఃఖమును, ప్రాప్నోతి=పొందుచున్నాఁడు.

అర్థాంతరము. తతః=విస్తారమైనట్టి, మన్దరాగోఽపి = మందరమనుపేరుగల కొండయు (క్రిస్వవుగొండ),భుజఙ్గేన=వాసుకి యనుసర్పముచేత, అతిసంగమం=మిక్కిలి సంబంధమును (అనఁగా చుట్టుటయును,) ఆసాద్య=పొంది, తద్భోగాత్-తత్=ఆవాసుకియొక్క, భోగాత్=శరీరమువలన, భ్రమన్ = తిరుగుచు, విషమం=పాతాళరూపమైన, కష్టం=గహనమును, ప్రాప్నోతి=పొందుచున్నది. అనఁగా పొందెననుట.

తా. ఏపురుషుఁడైనను స్వభావముచే నల్పమైనయనురాగముగలవాఁడైనను విటపురుషులతోడి చెలిమిచే మోహయుక్తుఁడై మందరపర్వతము వాసుకిచే చుట్టఁబడినదియై సముద్రమందు త్రిప్పఁబడి పాతాళమునంటినటుల మిక్కిలి కష్టమును బొందును. చెడ్డసహవాసముచేత చెడ్డగుణములు గలుగుచున్నవిగాన, బోజుగులతోడిచెలిమి తగదనుట.

పూర్వమందు దుర్వాసోఋషి కోపమువలన దేవేంద్రునియైశ్వర్యమంతయు సముద్రమందుగలసిన దానింగాంచి మరలఁబడయుటకై దేవాసురులు సముద్రమును జిలుకుటకుఁ బ్రయత్నించి మందరపర్వతమును కవ్వముగాఁజేసి దానికి వాసుకి యను సర్పరాజును జుట్టి చిలుకగా నాకొండ పాతాళమువఱకు పోయెనని పురాణప్రసిద్ధము.

శ్లో. జలాశయస్య హృదయే కామ ప్సోసు ఇవోదితః,
బకీహ్యః ఖలు క్షపాః ప్రాప్తః క్షయం యాతి నభోగతః. 30

వ్యా.—జలేతి. జడాశయస్య మందబుద్ధేః - అజ్ఞస్యేతి యావత్ - హృదయే మనసి ఉత్పన్నః కామః విషయాభిలాషః 'బహ్వీర్బహుళాః వో తోగుణవచనా' దితి ఙీప్ప్రత్యయః-క్షపాః రాత్రీః ప్రాప్తోఽపి బహుదివసాను భూతోఽపి భోగతః అనుభవాద్ధేతోః క్షయం నాశం నయాతి-నజాతు కామః కామానా ముపభోగేన శామ్యతీతి భావః. కథం?సోమ శ్చంద్రమా ఇవ.సోఽపి జలాశయస్య సముద్రస్య హృదయే మధ్యే ఉదితః నభః గగనం గతః నభోగతః బహ్వీః క్షపాః ప్రాప్తోపి - బహ్వీషు రాత్రిషు ప్రకాశమానో పీత్యర్థః-క్షయం కళాహీనత్వం యాతి-కృష్ణపక్ష ఇతి శేషః.

టీ. జడాశయస్య=మందబుద్ధిగలపురుషునియొక్క, హృదయే = మనస్సునందు, ఉదితః=పుట్టినట్టి, కామః=విషయములందలియభిలాష, బహ్వీః=మిక్కిలియైనట్టి, క్షపాః =రాత్రులను, ప్రాప్తః=బొందినప్పటికిని (అనఁగా అనుభవింపఁబడినప్పటికిని), భోగతః= అనుభవహేతువువలన, క్షయం=నాశమును, న యాతి=పొందదు.

అర్థాంతరము. జలాశయస్య = సముద్రముయొక్క, హృదయే = మధ్యమందు, ఉదితః=పుట్టి, నభోగతః=ఆకాశమునుబొందిన, సోమః=చంద్రుఁడు, బహ్వీః=అనేకములైన, క్షపాః=రాత్రులను, ప్రాప్తోఽపి=పొందినవాఁడైనను (అనఁగా ప్రకాశమానుఁడైనను), క్షయం=కలాహీనత్వమును, యాతి=పొందుచున్నాఁడు.

తా. సముద్రమధ్యమం దుదయమై యాకాశమును బొందినచంద్రుఁ డనేకరాత్రులందు ప్రకాశమానుఁడైనను కృష్ణపక్షరాత్రులం దెవ్విధముగాఁ గళాహీనత్వమును బొందునో, అట్లు మందబుద్ధియగువాని హృదయమందు జనించిన కామవికారము, అనేకరాత్రులు భోగించినను ఆభోగమువలన కామము నాశము కాదు. లడల కభేదముగనుక జలాశయమనుచోట జడాశయ మనియు నగును. కామాసక్తిగలవాఁడు కామముచేతనే శాంతుఁడు కాఁడు. ఏలనఁగా మండుచుండు నగ్నిని శాంతపఱచవలయు నేని నీళ్ళచే నల్లార్పవలయునుగాని తైలాదులచే నార్పఁదరముగాదు.

శ్లో. క్షీణస్నేహో నిశాన్తేషు ముఞ్చం త్స్వాంజనసంహతిమ్,
ఆత్మన్యాప్తరుచి ర్యోగీ నిర్వాణం యాతి దీపవత్. ౩౧

వ్యా.—క్షీణేఇతి. నిశాంతేషు బహువచనసామర్థ్యాత్ గృహాదిషు - యథాహ భగవాన్ పాణినిః-'అర్ధర్చాః పుంసి చే'తి.ని."నిశాంతవస్త్య సదనభవనాగారమందిర" మిత్యమరః. క్షీణస్నేహః మమతారహితః స్వాం స్వకీయాం జనసంహతిం పుత్రాదివర్గం ముంచన్ సంత్యజన్ - అన్యథా దుస్త్యజత్వా త్సంసారస్యేతి భావః. ఆత్మని పరస్మిన్ వస్తుని. ఆప్తరుచి స్స్వీకృతప్రీతి రితి.యోగీ ధ్యాననిష్ఠః. ని. "యోగ స్సన్నహనో

పాయధ్యానసంగతియుక్తి” ష్విత్యమరః. నిర్వాణం మోక్షం యాతి. ని. “నిర్వాణం నిర్వృతౌ మోక్షే వినాశే గజమజ్జనే” ఇతి విశ్వః. కథం? దీపవత్ దీప ఇవ తేన తుల్యమిత్యాదినావతిః సోఽపి నిశాంతేషు రాత్ర్యవసానేషు క్షీణస్నేహో నష్టతైలః. ని. “తైలే చ సౌహృదే స్నేహ” ఇతి కోశః. స్వాం జనసంహతిం స్వస్య కజ్జలసమూహం ముంచన్ ఆత్మని స్వస్మిన్నేవ ఆత్తరుచిస్సంకుచితతేజాస్సన్ నిర్వాణం నాశం యాతి తైలక్షయాద్దీపో వినశ్యతి.

టీ. నిశాన్తేషు=ఇండ్లు మొదలగువానియందు, క్షీణస్నేహః=మమకారహీనుఁడై, స్వాం=తనదైన, జనసంహతిం=పుత్రులు మొదలగు జనసమూహమును, ముఞ్చన్=విడుచుచుండువాఁడై, ఆత్మని=పరవస్తువునందు, ఆత్తరుచిః=పొందఁబడినయాసక్తిగల, యోగీ=ధ్యాననిష్ఠుఁడగువాఁడు, నిర్వాణం=మోక్షమును, యాతి=పొందుచున్నాఁడు.

అర్థాంతరము. నిశాన్తేషు-నిశా=రాత్రులయొక్క, అన్తేషు=కొనలందు-అనఁగా ప్రాతఃకాలములందు, క్షీణస్నేహః-క్షీణ=నాశమైన, స్నేహః=తైలము గలట్టియు, స్వాఞ్జనసంహతిం-స్వ=తనదియైన, అఞ్జన=కాటుకయొక్క, సంహతిం=గుంపును, ముఞ్చన్=విడుచునట్టియు, ఆత్మని=తనయందే, ఆత్తరుచిః-ఆత్త = సంకోచింపఁబడిన, రుచిః=తేజస్సుగల, దీపవత్ = దీపమునుబోలె, (గృహాదులను పుత్త్రాదులను విడిచినయోగి) నిర్వాణం=మోక్షమును, యాతి=పొందుచున్నాఁడు.

తా. వేఁకువయందు తైలములేనిదియై కొడియందు కాటుకను విడుచుచు వెలుఁగును తనయందె యణఁచుకొని నాశమునుబొందు దీపమువలె గృహాద్యాసక్తిని వదలి పరమాత్మయందభిరుచిగలయోగి మోక్షమును బొందుచున్నాఁడు. ౩౧

శ్లో. ప్రకృష్టజాతరూపశ్రీర్మానేన చ మహత్తరః,
ఏకఏవ మహార్ఘేషు భవేత్సర్వోత్తరో భువి. ౩౨

వ్యా.—ప్రకృష్టేతి. ప్రకృష్ట మధికం జాతా ఉత్పన్నా రూపస్య స్వభావస్య సౌందర్యస్య వా శ్రీశ్శోభా యస్య స తథోక్తః. ని. “రూపం స్వభావే సౌందర్య”ఇతి విశ్వః. జాతం జన్మభావే క్తః. ప్రకృష్టా జాతరూపయో శ్శ్రీ ర్యస్య తథోక్తః. మానేన అభిమానేన మహత్తరః, మహాభిమానవా నిత్యర్థః. ఏవం విధః ఏకఃపురుషః న తు బహవః. భువి భూమౌ మహార్ఘేషు పూజ్యతమేషు. ని. “మూల్యే పూజావిధౌ వర్ఘ” ఇత్యమరః. సర్వోత్తరః సర్వోత్కృష్టో భవేత్. గుణాః పూజాస్థాన మితి భావః.

అన్యోఽప్యర్థః. ప్రకృష్టాజాతరూపస్య కాంచనస్య శ్రీ శ్శోభా యస్య స తథోక్తః. మానేన పరిమాణేన మహత్తరః మహత్పరిమాణ ఇత్యర్థః. ఏకఏవ అలంకారః భువి

మహార్ఘేషు మహామూల్యేషు అలంకారేషు మధ్యే సర్వోత్తరః సర్వేభ్యో రజతాదిరచితాలంకారేభ్యోఽధికః భవేత్.

టీ. ప్రకృష్టజాతరూపశ్రీః-ప్రకృష్ట=అధికమానట్టుగా, జాత=పుట్టినట్టి, రూప=స్వభావముయొక్క (లేక సౌందర్యముయొక్క), శ్రీః=కాంతిగలట్టియు, మానేన=అభిమానముచేత, మహత్తరః=మిక్కిలియధికుఁడైనట్టియు, ఏకః=ఒకఁడైన పురుషుఁడు, భువి=భూమియందు, మహార్ఘేషు=పూజ్యులందు, సర్వోత్తరః = సర్వోత్కృష్టుఁడుగా, భవేత్=అగుచున్నాఁడు. గుణవంతుఁడు పూజింపఁదగినవాఁడని భావము.

అర్థాంతరము. ప్రకృష్టజాతరూపశ్రీః-ప్రకృష్ట=శ్రేష్ఠమైన, జాతరూప = బంగారుయొక్క, శ్రీః=నిగ్గుగలట్టియు, మానేనచ=మహత్పరిమాణముచేతను, మహత్తరః=మిక్కిలిహెచ్చైనట్టి, ఏకఏవ = ఒకటేయైనట్టి అలంకారము, భువి = భూమియందు, మహార్ఘేషు=మిక్కిలివెలగలసొమ్ములలో, సర్వోత్తరః=అన్నిటిలో శ్రేష్ఠమైనది, భవేత్=అగుచున్నవి.

తా. మంచిబంగరుచే నిగ్గుగలిగి తూనికయందు గొప్పదియై వెలగలుగువస్తువులలో మేటియైన నొకయాభరణ మేతీరున అన్నిటిలోన మేటియైయుండునో,అట్లేచక్కనిసౌందర్యముచేత, లేక స్వభావముచేతఁ దనరి యభిమానముగలిగిన యొకపురుషుఁడే భూలోకమందు పూజ్యులలో మిక్కిలి శ్రేష్ఠుఁడగును. 32

శ్లో. నిర్ముక్తభోగశుచితా క్షమయా మూర్ధ్ని సన్నతిః,
మహిమ్నా చాప్యహీనత్వం న హ్యశేషస్య విద్యతే. 33

వ్యా.—నిర్ముక్తేతి.నిర్ముక్తైః నిశ్శేషత్యక్తైః భోగైస్సంగాదిభిః శుచితా శుద్ధత్వం క్షమయా క్షాంత్యా సహితా మూర్ధ్ని సన్నతిః తితిక్షా,నిరహంకారితా చేత్యర్థః.మహిమ్నా అమానిత్వాదిగుణేన అహీనత్వసంపూర్ణతా సమగ్రాభిమానాదిగుణవత్తేతియావత్. ఏతత్సర్వం గుణజాతం అశేషస్య అఖిలజనస్య న విద్యతే. గుణినో దుర్లభా ఇత్యర్థః.

అన్యోఽప్యర్థః. నిర్ముక్తః ముక్తకంచుకః స చాసౌ భోగశ్చ ఫణస్తేన శుచితా శుభ్రత్వం క్షమయా భూమ్యా మూర్ధ్ని సన్నతిః నమ్రతా మహిమ్నా భూదారకత్వాదిగుణమహత్త్వేన అహీనాం సర్పాణాం ఇనత్వం ప్రభుత్వం. ని. "ఇన స్సూర్యే ప్రభౌ" విత్యమరః. ఏతత్సర్వ మశేషస్య శేషవ్యతిరిక్తస్య న విద్యతే నాస్తి విద సత్తాయా" మితిధాతో ర్దై వాదికా ల్లట్.

టీ. నిర్ముక్తభోగశుచితా - నిర్ముక్త=చక్కఁగావిడువఁబడినట్టి, భోగ=సంగాదులచేత,శుచితా=పరిశుద్ధత్వము, క్షమయా = ఓర్పుచేతఁగూడిన, మూర్ధ్ని = శిరసునందు,

సన్నతిః=అహంకారము లేక యుండుటయు, మహిమ్నా చ=ప్రభావముచేతను, అహీన త్వం=నిండియుండుటయు, (ఇవియంతయు) అశేషస్య = ఎల్లవారికి, నవిద్యతే=కలుగదు. గుణవంతులు దొరకుట యరుదని భావము.

అర్థాంతరము. నిర్ముక్తభోగశుచితా - నిర్ముక్త=పొరవీడినట్టి, భోగ=పడిగెచేత, శుచితా=తెల్లదనమును, క్షమయా=భూమిచేత, మూర్ధ్ని=తలయందు, సన్నతిః=నమ్రత్వమును, మహిమ్నా = భూధారణాదిగుణమహత్త్వముచేత, అహీనత్వం - అహి=సర్పములయొక్క, ఇనత్వం=దొరతనమును, (ఇవియంతయు) అశేషస్య=శేషసర్పము కాని: వానికి, న విద్యతే=కలుగదు.

తా. పొరయూడి తెల్లనైన పడిగెలును భూమినివహించియుండు సర్పరాజత్వము మొదలగు గుణాధిక్యమును ఆదిశేషుఁడను సర్పమున కొకనికే యేవిధమునఁ గలిగి యున్నదో, అట్లే విషయాసక్తియుఁ గర్వమునులేక, ఓర్పు మొదలగుసద్గుణములు అందఱకుఁ గల్గియుండక యొకొకనికే గలిగియుండును. 33

శ్లో. అమన్దతరవార్యస్త్రధారాహతమహీభృతః,
చిత్రచాపధరా వీరా విద్యోతంతే ఘనా ఇవ. 34

వ్యా.—అమందతరేతి. అమందతరం తీక్ష్ణతరం వారణస్వభావం వారి తచ్చ తదస్త్రంచ తస్య ధారా తయా హతాః మహీభృతః, రాజానో యేషాం తేయద్వా- అమందా తీక్ష్ణా తరవారేః ఖడ్గస్య అస్త్రస్య చ ధారా తయా హతాః మహీభృతో రాజానో యేషాం తే తథోక్తాః, చిత్రచాపధరాః నానావర్ణధనుర్ధరాః, నానావర్ణ రత్నప్రత్యుప్తత్వా చ్చాపానాం చిత్రతా బంహీయ స్యాహవేఽపి అద్భుతధనుర్ధరాః వీరాః పరాక్రమిణః విద్యోతంతే విరాజంతే. కథం?ఘనా మేఘా ఇవ. తేఽపి అమంద తరయా అతిబహుళయా వారి జల మేవ అస్త్రం తస్య ధారయా ప్రవాహేణ హతాః ఘాతాః మహీభృతః పర్వతా యైస్తే తథోక్తాః చిత్రచాపధరాః ఇంద్రధనుష్మంతః తథాభూతా స్సంతః విరాజంతే.

టీ. అమన్దతర...భృతః-అమన్దతర=మిక్కిలితీక్ష్ణమైన, వారి=నిరోధించు స్వభావముగల, అస్త్ర = ఆయుధములయొక్క, ధారా=వాడిచేత, హత=కొట్టఁబడిన, మహీభృతః=రాజులుగల (లేక, అమన్ద=తీక్ష్ణమైన, తరవారి = ఖడ్గముయొక్కయు, అస్త్ర= ఆయుధముయొక్కయు, ధారా=వాడిచేత, హత=కొట్టఁబడిన, మహీభృతః=రాజులు గలట్టియు), చిత్రచాపధరాః-చిత్ర=పలువన్నెలుగల, చాపధరాః=విండ్లనుధరించునట్టి, వీరాః=వీరపురుషులు, విద్యోతంతే=మెఱయుచున్నారు.

అర్థాంతరము. అమన్దతర......భృతః - అమన్దతర = మిక్కిలి యెక్కువైన, వారి=నీరనెడి, అస్త్ర=ఆయుధముయొక్క, ధారా=ధారచేత (ప్రవాహముచేత), హత=దూకొనిపోయిన, మహీభృతః=పర్వతముగలట్టియు, చిత్రచాపధరాః=నానావర్ణములుగల ఇంద్రధనుస్సునుధరించినట్టి, ఘనాఇవ=మేఘములవలె, (శత్రువులను ఖండించుశక్తిగలవీరపురుషులు) విద్యోతంతే=వెలుఁగుచున్నారు.

తా. మిక్కిలి జలప్రవాహముచే వంకలుగాఁజేయఁబడిన పర్వతములుగలిగి రతనపువిల్లును ధరించిన మేఘములవలె, యతితీక్ష్ణములైన యాయుధములచే పరరాజులను గొట్టి మణిఖచితములగుట ననేక వర్ణములచే వెల్గుచున్న విండ్లనుధరించిన పోటరులు ప్రకాశించుచుందురని భావము.

శ్లో. నిశాత మసి మూఢం ద్రాక్కరేణోల్లాసయన్ రిపోః,
కబన్ధోత్థాపకో రాజా రాజతే జలధే రివ. ౩౫

నిశాతమితి. నిశాతం తీక్ష్ణం కరేణ హస్తేన ఊఢం ధృతం అసి మాయుధం ద్రాక్ శీఘ్రం. ని. "ద్రాఙ్మంక్షు సపది ద్రుత" మిత్యమరః. ఉల్లాసయన్ చాలయన్ హర్షాదితి శేషః. రిపోః ఏకవచన మతంత్రం రిపూణామిత్యర్థః. కబంధః శిరోరహితః కాయః. ని. "కబంధోఽస్త్రీ క్రియాయుక్తమపమూర్ధకళేబర" మిత్యమరః. సముత్థాపయతి తథోక్తః. తిష్ఠతే ర్ణ్యంతా "దర్తిహ్రీ" త్యాదినా పుగాగమః. రాజా నృపతిః రాజతే ప్రకాశతే రణశూరో నృపోత్తమ ఇతి భావః. కథం? జలధేః సముద్రస్య కబంధోత్థాపకః జలసంవర్ధకో రాజా చంద్రమా ఇవ. ని. "రాజా ప్రజాన్నృపే చంద్రే యక్షే క్షత్రియశక్రయో" రితివిశ్వః. సోఽపి నిశాతమసి నిశాయాః కృష్ణపక్ష రాత్ర్యాః తమస్యంధకారే మూఢం వ్యాపారాక్షమం లోక ప్రాణివర్గం ద్రాక్ సపది-ఉదయసమయ ఏవేత్యర్థః. కరేణ కిరణజాలేన ఉల్లాసయన్ సంతోషయన్ రాజతే ప్రకాశతే.

టీ. నిశాతం=చురుకైనట్టియు, కరేణ=హస్తముచేత, ఊఢం = ధరింపఁబడిన, అసిం=కత్తిని, ద్రాక్=త్వరితముగా, ఉల్లాసయన్ = ఝళిపించుచు, రిపోః=శత్రువులయొక్క, కబన్ధోత్థాపకః-కబన్ధ=మొండెమును, ఉత్థాపకః=ఎత్తుచుండు, రాజా=రాజు, రాజతే=తేజరిల్లుచున్నాఁడు.

అర్థాంతరము. నిశాతమసి-నిశా=రాత్రియొక్క, తమసి=చీఁకటియందు, మూఢం=కన్నులుకానని జనమును, కరేణ=కిరణములచేత, ద్రాక్=శీఘ్రముగా, అనఁగా ఉదయమందే, ఉల్లాసయన్=సంతసింపఁజేయుచుండు, జలధేః=సముద్రముయొక్క, కబన్ధ

త్థాపకః=నీటిని పొంగఁజేసెడు, రాజేవ = చంద్రుఁడో యనునట్లు, (యుద్ధరంగమున శత్రువులను దునుమాడురాజు) రాజతే=ప్రకాశించుచున్నాఁడు.

తా. కృష్ణపక్షరాత్రులందు జడంబగులోకమును తనకిరణములచేత ఉదయకాలమందె సంతసింపఁజేయుచు సముద్రము నుప్పొంగజేయు చంద్రునివలె, వాఁడియైన కత్తిని తనచేతిచే జళిపించుచు యుద్ధరంగమందు శత్రువులశిరస్సులను ఛేదింపుచునుండు రాజే ప్రకాశించుచున్నాఁడు. అనఁగా పరాక్రమవంతుఁడగు రాజే రాజనఁబడునని భావము. చంద్రుఁడుదయముకాఁగా సముద్రము పొంగుట ప్రసిద్ధము. 37

శ్లో. మణయ స్సుధియ శ్చాఽపి నిసర్గో దగ్ర తేజసః,
అన్తస్త్రాసేన నిర్ముక్తా రాజ్ఞాం స్యుర్హృదయఙ్గమాః. 38

వ్యా.—మణయ ఇతి. నిసర్గేణ స్వభావేన ఉదగ్ర ముత్కృష్టం తేజః ప్రకాశః యేషాం తే మణయః మరకతాదయః అంతఃమధ్యే త్రాసేన దోషేణ నిర్ముక్తాః,నిర్దోషాశ్చేత్యర్థః. ని. "త్రాస స్స్యా ద్భయదోషయో" రితి విశ్వః. రాజ్ఞాం నృపాణాం. హృదయంగమాః హృద్యాః స్యుః.'గమే స్సు'పీతి ఖశ్ ప్రత్యయః. 'అరుర్ద్విషే' త్యాదినాముమాగమః. రాజయోగ్యా భవేయు రిత్యర్థః. సుధియో విద్వాంసోఽపి నిసర్గేణ ఉదగ్రం తేజః పరావమానాసహిష్ణుత్వలక్షణం యేషాం తే తథోక్తాః "అధిక్షేపాద్యసహనం తేజః ప్రాణాత్యయేపిచే"తి తల్లక్షణం. అంతర్హృదయే త్రాసేన భీత్యా నిర్ముక్తాః భీతిరహితా శ్చే ద్రాజ్ఞాం ప్రభూణాం హృదయంగమాః ప్రియా స్స్యుః. రాజసమీపవర్తినా పురుషేణ దుష్టేన న భవితవ్య మిత్యర్థః.

టీ. నిసర్గోదగ్రతేజసః-నిసర్గ = తనంతనగలిగిన, ఉదగ్ర=శ్రేష్ఠమైన, తేజసః=కాంతిగల, మణయః=రత్నములు, అన్తః=మధ్యమందు, త్రాసేన=త్రాసమను దోషముచేత, నిర్ముక్తాః = విడువఁబడినవియై, రాజ్ఞాం=రాజులకు, హృదయఙ్గమాః=మనోహరములుగా, స్యుః=అగుచున్నవి.

అర్థాంతరము. సుధియోఽపి = పండితులును, నిసర్గోదగ్రతేజసః = స్వభావముచేతనే ప్రకాశించు పరాక్రమముగలవారై, అన్తః=మనస్సునందు, త్రాసేన=భయముచేత, నిర్ముక్తాః=విడువఁబడినవారై, రాజ్ఞాం = రాజులకు, హృదయఙ్గమాః=ప్రియులైనవారుగా, స్యుః=అగుచున్నారు.

తా. స్వభావజన్యమైన ప్రకాశముగల మరకతము మొదలగు రత్నములు త్రాసమనుదోషమునువిడిచి రాజుల కెవ్విధమున మనోహరము లగుచున్నవో, యట్లులె పండి

తులగువారు స్వభావముగా వెలుఁగుచు భయరహితులై రాజప్రియు లగుదురు. రాజసమీపమందుండువాఁడు దుష్టుఁడు కాఁగూడదని భావము.

శ్లో. పశ్యన్ మధ్యస్థయా దృష్ట్యా కామం ద్రుహ్యన్త మప్యరిం,
అనఙ్గీకృత్య య శ్శామ్యే త్సత్య మీశ్వర ఏవ సః. ౩౭

వ్యా.—పశ్యన్నితి. యః పురుషః కామం యథేచ్ఛం ద్రుహ్యంత మపకుర్వంతం-'ద్రుహ జిఘాంసాయాం' దైవాదికాచ్ఛతృ అతఏవ అరిం శత్రుభూత మపి మధ్యస్థయా దృష్ట్యా అనంగీకృత్య అనభ్యుపగమ్య శామ్యేత్ శాంతో భవేత్. సపురుషః ఈశ్వర ఏవ దైవ మేవ. క్షమా దేత త్సంభవతీతి భావః.

అన్యోఽప్యర్థః. ద్రుహ్యంత మిషు విసర్జనేన ద్రోహం కుర్వంతం అతఏవ అరింతం శత్రుభూతం కామం మదనం మధ్యస్థయా దృష్ట్యా ఫాలలోచనేన పశ్యన్ననంగీకారో ద్రుహ్యతః తస్యా స్థిరీకరణం - అభూతతద్భావే చ్వి ప్రత్యయః. సమర్థః, దగ్ధుం పర్యాప్త ఇతి యావత్. భవే దితి శేషః-యద్వా తం కామ మనంగీకృత్య భస్మావశేషం కృత్వా శామ్యేత్ తతో(ఽ)ధా ద్విరమేత్ స ఈశ్వరః త్రిలోచన ఏవ సత్యం నిశ్చితం.పురా కిల భగవాన్ త్రిలోచనః మదనం ఫాలలోచనేన దదాహేతి శ్రూయతే.

టీ. యః=ఏపురుషుఁడు, కామం = ఇచ్ఛానుసారముగా, ద్రుహ్యన్తం=అపకారమును జేయుచుండువాఁడు గనుకనే, అరిం=శత్రువునైనను, మధ్యస్థయా=తటస్థమైన, దృష్ట్యా=చూపుచేత, అనఙ్గీకృత్య=అనుసరించక, శామ్యేత్ = శాంతుఁడగుచున్నాఁడో, సః=వాఁడు, ఈశ్వరఏవ=దైవమే యగును.

అర్థాంతరము. ద్రుహ్యన్తం=బాణప్రయోగముచే ద్రోహ మొనర్చినవాఁడుగనుకనే; అరిం=శత్రువైన, కామం=మన్మథుని, మధ్యస్థయా = నొసలందుఁగల, దృష్ట్యా కంటిచేత (చూచుచు), అనఙ్గీకృత్య=అంగీకరింపక, (లేక, అనఙ్గీకృత్య=భస్మీకరించి) శామ్యేత్=శాంతినిబొందెనో, సః=వాఁడు, ఈశ్వరఏవ=ఈశ్వరుఁడే యగును.

తా. ఏపురుషుఁడు తనయిచ్ఛవచ్చినటుల ద్రోహమును జేయుచుండు శత్రువునకు విరోధముగాని మైత్రిగాని చేయక తటస్థుఁడై శాంతిగలవాఁడగునో; వాఁడు తన కపకారముచేసిన మన్మథుని ఫాలనేత్రముచే దహించి శాంతినిబొందిన పరమేశ్వరునివలె వెలయును.

పూర్వము దక్షప్రజాపతికిని శివునకును కలహముగలిగినందున దక్షుఁడు శివునకు యజ్ఞమందు హవిర్భాగమియ్యక యజ్ఞముచేయఁగా వానిపుత్త్రియైన గౌరి యచ

టికిఁబోయి అవమానితయగుటంజేసి యాశరీరమును విడిచి హిమవంతునికిఁ గూఁతురై పెరుఁగుచుండుకాలమున తారకాసురునిబాధకు తాళలేక దేవతలు పార్వతియందు కుమారస్వామిని గలిగించుటకై త్వరపడినవారై దక్షిణామూర్తిరూపమున హిమవత్పర్వతమున తపంబాచరించుచుండు పరమేశ్వరునకు కామవికారమును గలిగించుటకై మన్మథునిం బంపినంత, వాఁడు బాణమును వేయఁగా శివుఁడు ఫాలనేత్రముచే దహించెనని పురాణప్రసిద్ధము. 32

శ్లో. సుపార్థివైశ్చ పద్మైశ్చ సర్వతోముఖభూతిభిః,
ప్రసారితే మిత్రకరే త్యజన్తే కోశసంపదః. 33

వ్యా.—సుపార్థివై రితి. సర్వతోముఖ స్సర్వత ఆగామిన్యో భూతయః సంపదః యేషాం తే తథోక్తాః తై స్సుపార్థివైః సద్రాజైః కర్తృభిః మిత్రకరే సుహృద్హస్తే. ని.'అథమిత్రం సఖా సుహృ' దిత్యమరః ప్రసారితే సతి,యోద్ధుమితి శేషః. కోశానాం ఖడ్గపిథానానాం సంపదః త్యజంతే.

అన్యోప్యర్థః. సర్వతోముఖ ముదకం తేన భూతిస్సంపచ్ఛాయా యేషాం తాని తథోక్తాని. ని. 'కబంధ ముదకం పాథః పుష్కరం సర్వతోముఖ' మిత్యమరః. పద్మైస్సరసిజైః మిత్రకరే తరణికిరణే. ని. 'ద్యుమణి స్తరణిర్మిత్రః, బలిహస్తాంశవః కరా' ఇత్యుభయ త్రా ప్యమరః. ప్రసారితే సతి వ్యాప్నువతి సతికోశసంపదః కుట్మలసమృద్ధయః త్యజంతే ముచ్యంతే. ఉదితే సూర్యే పద్మాని వికసంతీత్యర్థః.

టీ. సర్వతోముఖభూతిభిః - సర్వతోముఖ = అన్నికడలనుండి వచ్చుచుండెడి, భూతిభిః=సంపదలుగల, సుపార్థివైః=చక్కనిదొరలచేత, మిత్రకరే=స్నేహితులచెయ్యి, ప్రసారితేసతి=చాపఁబడినదికాఁగా, కోశసంపదః=ధనసంబంధములు, త్యజన్తే=విడువఁబడుచున్నవి. (అనఁగా ధన మొసంగఁబడుచున్నది.)

అర్థాంతరము. సర్వతోముఖభూతిభిః-సర్వతోముఖ=జలముచేతఁగలిగిన, భూతిభిః=కాంతిసంపదలుగల, పద్మైః=తామరలచేత, మిత్రకరే=సూర్యకిరణము, ప్రసారితే సతి=వ్యాపించుచుండఁగా, కోశసంపద - కోశ=మొగ్గలయొక్క, సంపదః=సమృద్ధులు, త్యజన్తే=విడువఁబడుచున్నవి.

తా: నీటిచే నలరుచుండెడి తామరలు సూర్యకిరణములు వ్యాపించినపుడు తమ మొగ్గలను విరియఁజేయువిధంబున,నన్నిదిక్కులనుండిగలిగెడి సంపదగలరాజులు తమకు త్రుమిలగువారుఘెయిఁజాఛిరేని తమధనమునొసంగుటకై బొక్కసమును విడుచుచున్నారు.

ఇచట వ్యాఖ్యానమందు స్నేహితులు యుద్ధముచేయుటకై చెయిఁజాపఁగా రాజులు కత్తియొరలను విడుచుచున్నారని వ్రాయఁబడినది; యది యసమంజసంబుగాఁ దోఁచుచున్నది. లేక, ప్రసారితే మిత్త్రకరే అనుచోట అమిత్రకరే అని పదవిభాగముచేసిరేని యది యొకవిధముగా అర్థము కావచ్చును. అయినను 'ఉపార్జితానాం విత్తానాం త్యాగ ఏవహి రక్షణమ్' అనియుండుటచేత సర్వతోముఖసంపద్విశేషణము సార్థకమాచున్నది. గనుక ఖడ్గపిధానత్యాగమునకంటె మిత్త్రులకై ధనత్యాగము మేలు గదా?

శ్లో. విశిష్టం సర్వభూతేభ్య శ్శ్రోతవ్యగుణవత్తయా,
న త్యజే ద్విభుతా నిత్య మాకాశమివ భూమిపమ్. 38

వ్యా.—విశిష్టమితి. శ్రోతవ్యాః శ్రోతుం యోగ్యా గుణా ఔదార్యాదయః తేఽస్య సంతీతి శ్రోతవ్యగుణవాక్ తస్యభావ స్తత్తా తయా హేతునా సర్వేభ్యో భూతేభ్యః ప్రాణిభ్యో విశిష్టం గుణిత్వా చ్ఛ్రేష్ఠం భూమిపం రాజానం కర్మ ఆకాశ మివ నిత్యం అనవరతం విభుతా ప్రభుతా ప్రభుత్వం కర్తృ న త్యజ్యతి. గుణినం రాజానం కదాపి లక్ష్మీ ర్నముంచతీ త్యర్థః. ఆకాశ మపి శ్రోతవ్యగుణ శ్శబ్దః తద్వత్తయా, శబ్దగుణవత్తయేత్యర్థః. శబ్దగుణక మాకాశ మితి తార్కికాః. ఉపలక్షిత మితి శేషః. సర్వేభ్యో భూతేభ్యః పృథివ్యాదిభ్యో విశిష్టం పరమం మహత్త్వా త్సర్వత్రానుగతం నిత్య మవినాశి ఏవం విధమాకాశం కర్మ విభుతా వ్యాపకత్వం కర్తృ న త్యజతే.

టీ. శ్రోతవ్యగుణవత్తయా-శ్రోతవ్య=వినఁదగినట్టి, గుణవత్తయా=ఔదార్యాది గుణముకలుగు కారణముచేత, సర్వభూతేభ్యః = సమస్తప్రాణులకంటె, విశిష్టం = శ్రేష్ఠుఁడైనట్టి, భూమిపం=రాజును,నిత్యం=ఎల్లకాలము,విభుతా=ప్రభుత్వము, నత్యజేత్ =విడువదు.

అర్థాంతరము. శ్రోతవ్యగుణవత్తయా-శ్రోతవ్య=వినఁదగిన, గుణవత్తయా=గుణిభావముతోఁడఁగూడినదియై,సర్వభూతేభ్యః=పృథివి మొదలగు భూతములకంటె, విశిష్టం =అంతటనుబొందినట్టి, నిత్యం=నాశరహితమైన, ఆకాశమివ = బయలువలెనే, విభుతా =వ్యాపకత్వము, నత్యజేత్ =విడువదు.

తా. శబ్దగుణముతోఁడఁగూడుకొని సకలములయిన పృథ్వ్యాదిభూతములకంటె మహత్త్వనిత్యత్వాది ధర్మములుగల హెచ్చైనయాకాశము వ్యాపకత్వమును నెవ్విధమునవదలదో, అటులనే వినఁదగిన ఔదార్యాది సుగుణములు గలుగుటవలన, సకలప్రా

ణివర్గమునకంటె శ్రేష్ఠుఁడయినరాజును ప్రభుత్వ మెప్పుడును విడువకయుండును. "శబ్ద గుణక మాకాశం, తచ్చైకం విభునిత్యం చ" అని తర్కశాస్త్రము. ౩౯

శ్లో. కాలే మృదుశ్చ తీక్ష్ణశ్చ నృపః స్యా ద్యది సూర్యవత్,
ఉదయః క్రియతే తస్య మణ్డలే నానురాగిణా. ౪౦

వ్యా — కాల ఇతి. నృపః రాజా కాలే,ఏకస్మి న్నితి శేషః. మృదుః క్రౌర్య రహితః పున రన్యస్మి న్కాలే తీక్ష్ణః ఉదగ్రో యది స్యాత్, తస్య రాజ్ఞః మండలేన రాష్ట్రేణ దేశేనేతి యావత్. అనురాగిణా అనురాగవతా ఉదయః క్రియతే. రాజని ఉదగ్రే నీతిమృదౌ సతి ప్రజా అనురాగవత్యో భూత్వా రాజ్ఞోఽభ్యుదయం కుర్వంతీ త్యర్థః. 'మృదు శ్చే దవమన్యేత తీక్ష్ణా దుద్విజతే జనః, తీక్ష్ణ శ్చైవ మృదు శ్చైవ ప్రజానాం స తు సమ్మతః.' కథం? సూర్యవత్ సూర్య ఇవ. సోఽపి కాలే తీక్ష్ణో మృదు, దర్శనీయః తస్య సూర్యస్య మండలేన తేజోలక్షణేన అనురాగిణా అనురాగవతా ఉదయః క్రియతే సూర్యమండలం రక్తవర్ణ ఉదేతి కర్మణి లట్రూపం.

టీ. నృపః=రాజు, కాలే = ఒకకాలమందు, మృదుః = కోపములేనివాఁడును (మఱియొకకాలమందు) తీక్ష్ణః = క్రౌర్యముతోఁగూడినవాఁడును, స్యాద్యది=అగునేని, తస్య=ఆరాజునకు, అనురాగిణా=ప్రీతిగల, మణ్డలేన = రాష్ట్రముచేత, అనఁగా దేశమందలి ప్రజలచేత, ఉదయః=అభ్యుదయము, సూర్యవత్ = సూర్యునకువలెనే, క్రియతే = చేయఁబడుచున్నది.

అర్థాంతరము. సూర్యః = సూర్యుఁడు, కాలే=ఒకకాలమందు, (అనఁగా హిమకాలమందు) మృదుః=చల్లఁగా చూడఁదగినవాఁడును, కాలే=మరియొకకాలమందు, తీక్ష్ణః=వేఁడిమిచేతఁ జూచుటకుఁగానివాఁడును, స్యాద్యది = అగునేని, తస్య=ఆసూర్యునకు, అనురాగిణా =ఎఱ్ఱనయిన, మణ్డలేన = బింబముచేత, ఉదయః=పుట్టుక, క్రియతే = చేయఁబడుచున్నది.

తా. రాజగువాఁడు సూర్యునివలె నొకకాలమందు కోపములేనివాఁడును, మఱియొకకాలమందు కోపముగలవాఁడును అగునేని, యారాజునకు అనురాగముగల రాష్ట్రముచేత నభ్యుదయము గలుగఁజేయఁబడుచున్నది. "శ్లో. మృదుశ్చే దవమన్యేత, తీక్ష్ణా దుద్విజతే జనః, తీక్ష్ణశ్చైవ మృదుశ్చైవ ప్రజానాం సతు సమ్మతః" అనియుండుటచే, రాజు పూజ్యులందు మృదుస్వభావము గలవాఁడయి దుష్టులందు క్రౌర్యస్వభావము గలవాఁడయి యుండినచో వానికి జనులు ప్రీతిగలవారయి యుందురు. ౪౧

శ్లో. అనువేలం విహన్యంతే యస్య సిన్ధోరి వోద్యమాః,
తం ప్రమథ్య శ్రియః కోఽపి విపక్షో భూభృదుద్ధరేత్. ౪౧

వ్యా.—అనువేలమితి. యస్య రాజ్ఞః ఉద్యమాః వ్యాపారాః అనువేలం ప్రతిక్షణం విహన్యంతే వినాశ్యంతే. శత్రుణేతి శేషః-తం రాజానం కోఽపి విపక్షః శత్రుభూతో భూభృత్ కర్తా. ని. 'ద్విడ్విపక్షాహితామిత్రదస్యుశాత్రవశత్రవః,' 'భూభృద్భూమిధరే నృప'ఇతి చామరః. ప్రమథ్య ప్రబాధ్య శ్రియః కోశాద్యాః సంపదః ఉద్ధరే దపహరేత్. బుద్ధిహీనస్య రాజ్యం వినశ్యతీత్యర్థః. కస్యేవ? సింధోస్సముద్రస్యేవ. తస్యాపి ఉద్యమాః ఉచ్ఛ్వసనాదయః అనువేలం వేలాం మర్యాదాం అనులక్షీకృత్య విహన్యంతే. తం సముద్రం కోఽపి విపక్షః విగతగరుత్, మందరాద్రి రిత్యర్థః. ఇంద్రేణ లూనపక్షత్వా ద్విగతపక్షత్వ మస్యేతి భావః. ప్రమథ్య మథిత్వా శ్రియః రమాద్యాస్సంపదః ఉద్ధరేత్. ప్రకాశయే దిత్యర్థః.

టీ. యస్య=ఏరాజుయొక్క, ఉద్యమాః=ఉద్యోగములు, అనువేలం=కాలకాలమందును, విహన్యంతే=పగరచేత నశింపఁబడుచున్నవో, తం=ఆరాజును, కోఽపి=ఎవఁడయినను, విపక్షః=శత్రువయిన, భూభృత్=రాజు, ప్రమథ్య=బాధించి, శ్రియః = భండారము మొదలుగాఁగల సంపదలను, సిన్ధోరివ = సముద్రసంపదలనువలెనే, ఉద్ధరేత్=అపహరించును.

అర్థాంతరము. యస్య=ఏ, సిన్ధోః = సముద్రముయొక్క, ఉద్యమాః=ఉప్పెన మొదలగు వ్యాపారములు, అనువేలం=గట్టునుగుఱించి, విహన్యంతే = కొట్టఁబడుచున్నవో, తం=ఆసముద్రమును, కోఽపి = ఒకానొకటియయిన, విపక్షః = ఱెక్కలులేని, భూభృత్ = మందరపర్వతము, ప్రమథ్య=చిలికి, శ్రియః = అమృతము, లక్ష్మి, కామధేనువు మొదలగు సంపదలను, ఉద్ధరేత్ = ప్రకాశపఱుచును.

తా. ఏరాజుయొక్క ఆలోచనలన్నియు బయలుపడి పరరాజులచే శెరుపఁబడుచున్నవో, అట్టిరాజును ఎవఁడయిన నొక శత్రురాజు బాధించి వాని ఐశ్వర్యములను, ఉప్పెనచేత తీరముల నాక్రమించు సముద్రుని మందరపర్వతముమథనముచేసి అమృతము మొదలగువానిని యెత్తినచందమున నెత్తును. అనఁగా, బుద్ధిలేక ఆలోచనలనుబయలుపఱుచురాజు శత్రువుచే జయింపఁబడును.

శ్లో. ఆక్రమ్య యస్య దోర్దండ మరిచక్రం ప్రకాశతే,
ప్రాప్నోతి పురుషో లోకే సవైకుణ్ఠఇతి ప్రథామ్. ౪౨

వ్యా.—యస్య రాజ్ఞః దోర్దండం, భుజబల మిత్యర్థః. ఆక్రమ్య అరిచక్రం శత్రుసమూహః కర్తృ ప్రకాశతే. ఉత్కర్షేణ వర్తత ఇత్యర్థః. స పురుషః లోకే కుంఠః శత్రువిజయాదావక్షమ ఇతి ప్రథాం ఖ్యాతిం ప్రాప్నోతి. ని.'కుంఠో మందః క్రియా' స్విత్యమరః. అత్ర వైశబ్దః పాదపూరణే.

అన్యోఽప్యర్థః. యస్య హరేః దోర్దండం భుజదండం ఆక్రమ్య ఆశ్రిత్య, అధిష్ఠాయే త్యర్థః.అరాణి అంగాని శకటాదీని అస్య సంతీ త్యరి.ని.'అరం శీఘ్రే చ చక్రాంగ' ఇతి విశ్వః. తచ్చక్రం సుదర్శనం ప్రకాశతే. స ప్రసిద్ధః పూర్ణత్వా త్పూరిశయానాద్వా పురుషః భగవాన్ లోకే జగతి వైకుంఠః విష్ణు రితి ప్రథాం ఖ్యాతిం ప్రాప్నోతి. సాకారతయా భగవత శ్చక్రపాణిత్వా దితి భావః.

టీ. యస్య=ఏరాజుయొక్క, దోర్దణ్డం=దండమువలెనుండు భుజమును (అనఁగా బాహుబలమును), ఆక్రమ్య = స్వాధీనపఱుచుకొని, అరిచక్రం=శత్రుసముదాయము, ప్రకాశతే=వెలుఁగుచున్నదో, సః వై=ఆ, పురుషః = మనుష్యుఁడు, కుణ్ఠ ఇతి=సామర్థ్యములేనివాఁడని, లోకే=జగత్తునందు, ప్రథాం=ప్రఖ్యాతిని, ప్రాప్నోతి = పొందుచున్నాఁడు.

అర్థాంతరము. యస్య=ఏవిష్ణువుయొక్క, దోర్దండం=భుజదండమును, ఆక్రమ్య =ఆశ్రయించి, అరిచక్రం-అరి=అరములను నవయవములుగల, చక్రం=చక్రాయుధము, ప్రకాశతే=వెలుఁగుచున్నదో, సః=అట్టిప్రసిద్ధిగల, పురుషః = భగవంతుఁ డగువిష్ణువు, లోకే=భువనమందు, వైకుణ్ఠఇతి = వైకుంఠుఁడని, ప్రథాం=ఖ్యాతిని, ప్రాప్నోతి = పొందుచున్నాఁడు.

తా. భుజపరాక్రమముచేత పరరాజులను జయింపక సామర్థ్యములేనివాఁడయి పరరాజులకు వశుఁడయియుండెనేని, యారాజు ప్రసిద్ధినొందఁజాలఁడు. మఱియు, 'ఆక్రమ్య-దోర్దణ్డం'అనియుండుటంబట్టి తనకేలును శత్రురాజున కూఁతకోలగా నిచ్చువాఁడని యు నర్థమగుటచే పరరాజులను హస్తలాఘవమిచ్చి సేవించువాఁడనియు ధ్వనిగలుగుచున్నది.

ద్వితీయార్థమున, ఇతరము లయిన శార్ఙ్గాద్యాయుధము లుండినను చక్రమే ముఖ్యాయుధముగాఁ గలవాఁడు విష్ణువని భావము. ఇచట, వై అనుపాదపూరణార్థకాక్షరమును నొకతఱి జేర్చుకొనుటచేతను నొకతఱి విడుచుటచేతను నర్థద్వయము నుకాన్వదంబయియున్నది.

శ్రీ

శ్లో. బలినా విద్విషే పుంసే పదం దీయేత చేద్భువి,
మహత్త్వం ప్రాప్య సోఽల్పోఽపి విక్రమేణ శ్రియం హరేత్.

వ్యా.—బలినేతి. బలినా బలవతాఽపి రాజ్ఞా విద్విషే శత్రుభూతాయ పుంసే పురుషాయ అన్యస్మై రాజ్ఞే భువి, స్వకీయాయా మితి శేషః. పదం స్థానం దీయేత చేత్ తర్హి శత్రు రల్పోఽపి, కోశాదిభి రితి శేషః. తై రేవ మహత్త్వం అతిశయం ప్రాప్య విక్రమేణ పురుషకారకరణేన శ్రియం కోశాదీన్ హరేత్. శత్రుపాలనం స్వవినాశాయ భవతీతి భావః.

అన్యోఽప్యర్థః. బలినా వైరోచనేన కర్త్రా విద్విషే పుంసే వామనరూపిణే హరయే భువి భూమౌ పదం చరణత్రితయసంమితం స్థానం దీయేత చేత్ సోఽల్పోఽపి వామనరూపోఽపి విక్రమేణ త్రివిక్రమావతారేణ మహత్త్వం మహాకారతాం ప్రాప్య శ్రియం రాజ్యలక్ష్మీం హరేత్ స్వీకుర్యాత్.

టీ. బలినా=బలముగలరాజుచేనయినను, విద్విషే=శత్రువయిన, పుంసే=పురుషునికొఱకు, భువి=తనభూమియందు, పదం=స్థానము, దీయేతచేత్=ఇయ్యఁబడినట్టయిన, సః=ఆశత్రువు, అల్పోఽపి=కోశాదులచే నల్పుఁడయినను, మహత్త్వం = గొప్పతనమును, ప్రాప్య=పొంది, విక్రమేణ=పరాక్రమముచేత, శ్రియం = భండారాదిసంపదను, హరేత్=అపహరించును.

అర్థాంతరము. బలినా=బలిచక్రవర్తిచేత, విద్విషే=శత్రువైన, పుంసే = వామనరూపుఁడయిన పురుషోత్తమునికొఱకు, భువి=భూమియందు, పదం = మూఁడడుగులంత నేల, దీయేతచేత్=ఇయ్యఁబడినట్లయిన, సః=ఆవిష్ణువు, అల్పోఽపి = వామనరూపుఁడయినను, మహత్త్వం=త్రివిక్రమత్వముచే గొప్పదనమును, ప్రాప్య=పొంది, శ్రియం=రాజ్యలక్ష్మిని, హరేత్=అపహరించును.

తా. రాజు తానుబలవంతుఁడయియుండి శత్రువు బలహీనుఁ డనియెంచి తనదేశమందు శత్రువునకు కొంచెము భూమి నిచ్చెనేని, యాశత్రువు కోశాదులచేత బలము గలవాఁడయి క్రమముగా పూర్వమునందు విష్ణువు బలిచక్రవర్తియొద్దకు వామనుఁడయి చని మూఁడడుగులనేలను యాచించి తోడనే మూఁడులోకములను ఆక్రమించినట్లు శత్రువు భూమినంతయును ఆక్రమించును. శత్రు వెంతచిన్నవాఁ డయినను కొంచెమైనను స్థలమియ్యరాదు. బలిచక్రవర్తిని వామనమూర్తి జయించినకథ భాగవతాదులందు ప్రసిద్ధము.

శ్లో. నలినానాం నృపాణాం చ శ్రియం హి మహతా మపి,
మిత్రప్రతాపో భూయోఽపి వర్ధయత్యనిశోజ్జ్వలామ్. ౮౮

వ్యా.—నళినానామితి. హిమేన తుహినేన హతాం క్లిష్టాం, నిశాయాం రాత్రా వుజ్జ్వలతీతి నిశోజ్జ్వలా సా న భవతీతి తథోక్తా. రాత్రౌ పద్మానా మవికాసా దితి భావః. తాం నళినానాం పద్మానాం శ్రియం శోభాం భూయః పునః, ప్రభాత ఇత్యర్థః. మిత్రస్య సూర్యస్య ప్రతాపః తేజః కర్తృ వర్ధయతి. ఉదితే సూర్యే పద్మాని వికసంతీ త్యర్థః.

అన్యోఽప్యర్థః. అనిశం అనవరతం ఉజ్జ్వలతీతి సా తథోక్తా తాం మహతాం నృపాణాం శ్రియం కర్మ మిత్రాణాం సుహృదాం ప్రతాపః పౌరుషం కర్తా భూయోఽధికం యథాతథా వర్ధయతి. 'వృధువృధా'విత్యస్మాద్ధాతో ర్హేతుమత్త్వా ల్లట్. నాసహాయ ముపేయా జ్జయశ్రీ రితిభావః.

టీ. హిమహతామపి - హిమ=మంచుచేత, హతామపి = క్లేశమునుబొందినట్టి, అనిశోజ్జ్వలాం=రాత్రులందు ప్రకాశింపని, నళినానాం=కమలములయొక్క, శ్రియం = కాంతిని, భూయోఽపి=మరల, అనఁగా ప్రాతఃకాలమందు, మిత్రప్రతాపః—మిత్ర= సూర్యునియొక్క, ప్రతాపః=తేజస్సు, వర్ధయతి = పెంపొందుచున్నది.

అర్థాంతరము. అనిశోజ్జ్వలాం - అనిశ=ఎల్లప్పుడును, ఉజ్జ్వలాం=ప్రకాశించునట్టి, మహతాం=గొప్పవారైన, నృపాణాం = రాజులయొక్క, శ్రియం=సంపదను, మిత్రప్రతాపః = స్నేహితులపౌరుషము, భూయః=అధికమానట్టుగా, వర్ధయతి = పెంపొందుచున్నది.

తా. మంచుచే పెంపుబాసి రాత్రులందు ప్రకాశింపని తామరలకాంతిని సూర్యకాంతి మరల ప్రాతఃకాలమందు వృద్ధిబొందించునట్లు, మహాత్ములగు రాజులసంపదలను సుహృదులు వృద్ధి బొందించు చున్నారు. సహాయసంపత్తిలేకయే జయలక్ష్మికలుగ నేరదని భావము. మంచునకును తామరలకును విరోధముగనుక, తామరలు రాత్రులందుప్రకాశింపక తమకు హితకరమైన సూర్యప్రభయందు ప్రకాశించుట స్వభావసిద్ధము. ౮౮

శ్లో. స్వస్థానా దవరో ప్యేత బలా త్పుంసా పరేణ యః,
అపారిజాతం న ప్రాహుః పార్థివం పాదపం చ తమ్. ౮౯

వ్యా.—స్వస్థానాదితి. యో నృపః పరేణ శత్రుభూతేన పుంసా పురుషేణ కర్త్రా స్వస్య స్థానాత్ రాజ్యలక్షణాత్ అపాదానాత్ బలా త్సత్త్వాతిశయా ద్ధేతోః అవరోప్యేత స్వస్థానా దవరోప్యేత ఉన్మూల్యేత. పాదపం పాదం తురీయాంశం

పాతీతి పాదపః రాష్ట్రైకదేశపాలకః పార్థివం రాజానం అపారిజాతం అపగతశత్రు సమూహం న ప్రాహుః. సశత్రుక మేవాహు రిత్యర్థః. తం ప్రసిద్ధం పాదపం తరుం చ అపారిజాతం పారిజాతో దేవతరుః స న భవతీ త్యపారిజాతః తం న ప్రాహుః. అపి తు దేవతరు మేవాహురిత్యర్థః. య స్తరుః పరేణ పుంసా పరమపురుషేణ వాసుదేవేన స్వస్య స్థానాత్ స్వర్గలక్షణాత్ బలా దవరోప్యేత ఉన్మూల్యే తేతి వ్యతిరేకేణ యోజనా. అథవా యః స్వర్ద్రుమః పరేణ పుంసా కృష్ణేన బలాత్ స్వస్థానా దవరోప్యేత తం అపారిజాతం న ప్రాహుః పారిజాత మేవాహుః. పార్థివం భౌమం పాదపం చ తరుం చ న ప్రాహుః. పురా కిల భార్యయా ప్రార్థ్యమానో దేవకీనందనః పారిజాతాఖ్య దేవతరు మస్మా ల్యావనీం నీతవా నితి భారతీ కథా.

టీ. యః=ఏరాజు, పరేణ=శత్రువైన, పుంసా = పురుషునిచేత, స్వస్థానాత్= తనరాజ్యమువలననుండి, బలాత్=బలిమివలన, అవరోప్యేత=త్రోయఁబడుచున్నాఁడో, పాదపం=నాల్గింటినొకపాలునురక్షించునట్టి, అనఁగా రాష్ట్రమం దొక కొంతప్రదేశము నకు దొరయైనట్టి, తం=ఆ, పార్థివం=రాజును, అపారిజాతం—అప=పోఁగొట్టఁబడిన, అరి=శత్రువులయొక్క, జాతం=సమూహముకలవాఁడని (అనఁగా శత్రువులేనివాఁడని), న ప్రాహుః=పలుకరు.

అర్థాంతరము. యః=ఏవృక్షము, పరేణ=శ్రేష్ఠుఁడైనట్టి, పుంసా=పురుషునిచేత, అనఁగా పురుషోత్తముఁడైన కృష్ణునిచేత, స్వస్థానాత్ = స్వర్గస్థానమునుండి, బలాత్= బలిమివలన, అవరోప్యేత = భూమికిదింపఁబడుచున్నదో, తం=అట్టి, పాదపం = వృక్షమును, పార్థివం=భూలోకమందు బుట్టినదానిగాను, అపారిజాతం = పారిజాతముకాద నియును, న ప్రాహుః=చెప్పరు.

తా. శత్రురాజుచే రాజ్యమునుండి వెడలఁగొట్టఁబడి కొంతప్రదేశమునకు మాత్రము ప్రభువుగానుండు రాజును శత్రువులేనివాఁడనియును, శ్రీకృష్ణునిచేత స్వర్లోకమునుండి భూలోకమునకుఁ దేఁబడిన కల్పవృక్షము పారిజాతవృక్షము కాదనియును చెప్పరు. ఈకథ భాగవతాది గ్రంథములందు బ్రసిద్ధము. ౪౫

శ్లో. విరసప్రకృతి ర్భూపః సత్త్వవానపి సిన్ధువత్,
రాజ్ఞా స్వాన్తసముత్థేన క్షోభ్యతే మృదునాపిసః. ౪౬

వ్యా.—విరసప్రకృతిరితి. విరసప్రకృతిః నిర్గుణస్వభావః ఔదార్యవినయాది గుణవిహీన ఇత్యర్థః. విరక్తప్రకృతి ర్వా భూపో రాజా సత్త్వవాన్ బలవా నపి స్వాంత సముత్థేన స్వమధ్యజాతేన, స్వకులీనే నేత్యర్థః. మృదునా దుర్బలే నాపి రాజ్ఞా నృపేణ,

క్షోభ్యతే సంచాల్యతే. రాజ్ఞా గుణినా అవహితేన భవితవ్య మితి భావః. కథం? సింధువత్ సముద్ర ఇవ. సోఽపి విరసప్రకృతిః లవణమయత్వా దమధురస్వభావః సత్త్వవాన్ మకరాదిజలగ్రహవాన్ స్వాంతసముత్థేన స్వమధ్యసముత్థేన మృదునా దర్శనీయే నాపి రాజ్ఞా చంద్రమసా క్షోభ్యతే కలుషీ క్రియతే. ఉదితే ఖలు చంద్రమస్యుదన్వా నుద్వేలో భవతి.

టీ. యః=ఏరాజు, విరసప్రకృతిః=గుణములేనిస్వభావముగల, (అనఁగా శౌదార్యాదిగుణములులేనట్టి) లేక, విరస=విరక్తులైన, ప్రకృతిః=రాజ్యాంగములగు స్వామ్యాదులుకాని, పురజనులుకానిగలవాఁడో, సః=అట్టి, భూపః=రాజు, సత్త్వవానపి=బలముగలవాఁడైనను, స్వాన్తసముత్థేన-స్వ=తనయొక్క, అంత=మధ్యమందు (అనఁగా తనకులమందు), సముత్థేన=పుట్టినట్టి, మృదునా=బలహీనుఁడైన, రాజ్ఞా=రాజుచేత, విరసప్రకృతిః-విరస=మిక్కిలియుప్పగుటచే తీపులేనట్టి, ప్రకృతిః=స్వభావముగల, సత్త్వవాన్=మొసలిమొదలగు జలజంతువులుగల, సిన్ధువత్=సముద్రము, స్వాన్తసముత్థేన=తనమధ్యమందుఁబుట్టినట్టి, మృదునా=మనోహరుఁడైన, రాజ్ఞా=చంద్రుని, క్షోభ్యతే=కలుషయుక్తుఁడుగాఁ జేయఁబడుచున్నాఁడు.

తా. మొసళ్ళుమొదలగు దుష్టజంతువులుగల సముద్రుఁడు తనలో పుట్టినట్టిమనోహరుఁడైన చంద్రునిచేత నేలాగున కలుషితుఁడగు చున్నాఁడో యవ్విధమున ప్రకృతిమండలమందనురాగములేనిరాజు బలవంతుఁడైనను తనకులమందుపుట్టిన బలహీనుఁడైనరాజుచేత జయింపఁబడుచున్నాఁడు. ప్రకృతిమండలమనఁగా:-"స్వామ్యమాత్యసుహృత్కోశరాష్ట్రదుర్గబలానిచ, రాజ్యాఙ్గాని ప్రకృతయః పౌరాణాం శ్రేణయోఽపి చ" అని అమరము. ప్రకృతిశబ్దము రాజ్యాంగములగు స్వామ్యాదులకును,పురుజనులకును జెరగుచున్న. శ్లో. "స్వామ్యమాత్యశ్చరాష్ట్రంచ దుర్గం కోశో బలం సుహృత్, పరస్పరోపకారీదం సప్తాంగం రాజ్యముచ్యతే." అని కామందకము. స్వామ్యాదు లొకరికొకరుపకారవంతులై యుందురుగాన పరస్పర మనురాగముగలవారుగా నుండవలయును. పురజనులయందనురాగము గలిగి యుండవలయును. అట్లయ్యే నేని యారాజు దుర్జయుఁడుగానుండును. ౪౬

శ్లో. యస్య రాజ్ఞో నవసుధా సేవ్యా సుమనసాం గణైః,
ధ్రువం బహుళదోషోత్థః క్షయః స్యా త్తస్య మణ్డలే. ౪౭

వ్యా.—యస్యేతి. యస్య రాజ్ఞః నృపస్య వసుధా భూమిః సుమనసాం సుధియాం. విదుషా మితి భావత్. యద్వా సుమనసాం స్వచ్ఛచిత్తానాం పురుషాణాం

గణైః సమూహైః సేవ్యా అనుభవనీయా న భవతి. తస్య రాజ్ఞః నృపస్య మండలే రాష్ట్రే, దేశే ఇతి యావత్. బహుళదోషోత్థః భూయిష్ఠపాపజాతః క్షయః క్షీణతా స్యా ద్భవేత్. ధ్రువం నిశ్చితం దేవతానా మనర్చనా దపాలనా న్మహాత్మనాం చ రాజ్ఞో రాష్ట్రం వినశ్యతీతి భావః.

అన్యోఽప్యర్థః. యస్య రాజ్ఞః చంద్రమసః నవసుధానవీనామృతం సుమనసాం దేవానాం గణైః పఙ్క్త్యాదిభి స్సేవ్యా ఆస్వాద్యా స్యాత్ ధ్రువం భవతి.'తం చ సోమం పపు ర్దేవాః పర్యాయే ణానుపూర్వశః' ఇతి వ్యాసస్మరణా దితి భావః. తస్య చంద్రస్య మండలే బహుళదోషోత్థః కృష్ణపక్షరాత్రిజాతః క్షయః కళాహీనతా. 'నిష్పీతాంగః కలాశేష శ్చంద్రమా న ప్రకాశతే' ఇతి స్మరణా దితి భావః.

టీ. యస్య=ఏ, రాజ్ఞః=రాజుయొక్క, వసుధా=భూమి, సుమనసాం=విద్వాంసులయొక్క, గణైః=గుంపులచేత, సేవ్యా = అనుభవింపఁదగినది, నభవతి = కాదో, తస్య=ఆరాజుయొక్క, మణ్డలే=రాష్ట్రమందు, బహుళదోషోత్థః - బహుళ=హెచ్చయిన, దోష=పాపముచేత, ఉత్థః=పుట్టినట్టి, క్షయః=నాశము, స్యాత్=అగును, ధ్రువం =నిశ్చయము.

అర్థాంతరము. యస్య=ఏ, రాజ్ఞః=చంద్రునియొక్క, నవసుధా=నూతనమైనయమృతము, సుమనసాం = దేవతలయొక్క, గణైః=సమూహములచేత, సేవ్యా=పానము చేయఁదగినది, స్యాత్=అయ్యెనో, తస్య=ఆచంద్రునియొక్క, మణ్డలే=బింబమందు, బహుళదోషోత్థః-బహుళ=కృష్ణపక్షమందలి,దోషా=రాత్రివలన, ఉత్థః=కలిగిన, క్షయః =నాశము, అనఁగా కలాహీనత్వము, భవతి=అగును, ధ్రువం=నిజము.

తా. రాజగువాఁడుతనసంపదను పండితులగువారికి ఉపయోగపడునట్లుచేయకుండెనేని, వానిరాజ్యము పాపాధిక్యముచేత కృష్ణపక్ష చంద్రుని కలలు నశించునటుల నశించును. చంద్రునియందుఁగల నూతనామృతమును దేవతలు క్రమముగా పానముచేయుటవలన బహుళపక్షమందు కలలునశించును. శ్లో. "అగ్నౌ హుతంచ దత్తంచ సర్వం సోమగతం భవేత్, తత్ర సోమస్సముత్పన్నః శీతాంశు ర్విమలక్షణః, అష్టాశీతిసహస్రాణి విస్తీర్ణే యోజనానితు, ప్రమాణం తత్ర విజ్ఞేయం కలాః పఞ్చదశైవతు, షోడశాపి కలాప్యత్ర ఇత్యేకాపి విధీర్భవేత్, తంచ సోమం పపుర్దేవాః పర్యాయేణానుపూర్వశః, ప్రథమాం పిబతే వహ్ని ర్ద్వితీయాం పిబతే రవిః, విశ్వేదేవా స్తృతీయాం తు చతుర్థాం సలిలాధిపః, పఞ్చమాంతు వషట్కారః షష్ఠీం పిబతి వాసవః, స ప్తమీం ఋషయో దేవా అష్టమీ మప్యజైకపాత్, నవమీం కృష్ణపక్షస్య యమఃప్రాశ్నాతివైకలాం, దశమీం పిబతే వా

యుః పిబ త్యేకాదశీ ముమా, ద్వాదశీం పితరస్సర్వే సమస్త్యాతు విభాగశః, త్రయోదశీం ధనాధ్యక్షః కుబేరః పిబతే కలాం, చతుర్దశీం పశుపతిః పఞ్చదశ్యాం ప్రజాపతిః, నిపీతైకకలా శేష శ్చన్ద్రమాన ప్రకాశతే, కలా షోడశికా యాసా త్వపః ప్రవిశతే సదా, అమాయాంతు సదాసోమ ఓషధీః ప్రతిపద్యతే. అని వ్యాసస్మృతియం దుండుటవలన కృష్ణపక్షపాడ్యమి మొదలుకొని అమావాస్యవఱకు చంద్రునికలలను వరుసగా అగ్ని రవి విశ్వేదేవ వరుణ వషట్కార వాసవ ఋష్యజైకపా ద్యమ వాయు ఉమా పితృకుబేర శంకర ప్రజాపతులు పానముచేయుదురు. ఇట్లు నశింపఁబడిన చంద్రుని పదియాఱవకల అమావాస్యయందు ఔషధములను నీరును బొందినవియై యావులచే భక్షింపఁబడి యా యావులపాలు నెయ్యి యగ్నియందు బ్రాహ్మణులచేహోమముచేయఁబడుటచే మరల చంద్రుఁడు కలలను బొందును. ౪౭

శ్లో. అధః కుర్వన్ ప్రజా స్సర్వా బహుధా మహిమోల్బణః,
రాజా పర్వణి కస్మిం శ్చి ద్భవే దహి భయాకులః. ౪౮

వ్యా.—అధః కుర్వ న్నితి. బహుధా బహుప్రకారేణ మహిమ్నా మహత్త్వేన తేజస్వి త్వాదిరూపేణ ఉల్బణః వ్యక్తోఽపి. ని. 'స్ఫుటం ప్రవ్యక్త ముల్బణ' మి త్యమరః. రాజా నృపః సర్వాః ప్రజాః అధఃకుర్వన్ ప్రభావేన తిరస్కుర్వన్ కస్మింశ్చిత్ పర్వణి కాలే. ని.'పర్వ స్యా దుత్సవే గ్రంథౌ ప్రస్తావే లక్షణాంతరే, దర్శప్రతిపదో స్సంధౌ విషువత్ప్రభృతావ పీ'తి విశ్వః. అహి భయాకులః అహిభయేన స్వపక్షోద్భూతభయేన. ని. 'మహీభుజా మహిభయం స్వపక్షప్రభవం భయ'మి త్యమరః. ఆకులో భవేత్. విరక్తాసు ప్రకృతిషు రాజా వినశ్యతీ త్యర్థః.

అన్యోఽప్యర్థః. సర్వాః ప్రజాః భూమిస్థాన్ అధఃకుర్వన్-స్వస్య గగనసంచారతయేతి భావః. బహూనాం ఓషధివనస్పత్యాదీనాం ధామ్న ఆశ్రయేణ జీవనభూతేన హిమేన తుహినేన ఉల్బణః రాజా చంద్రః కస్మింశ్చి త్పర్వణి పూర్ణిమాప్రతిపత్సంధౌ అహిభయాత్ రాహూద్భూతా ద్భయాత్ ఆకులో భవేత్.

టీ. బహుధా=అనేకవిధములైన, మహిమోల్బణః = ప్రభావముచేత వ్యక్తుఁడై నను, రాజా=రాజు, సర్వాః = సమస్తమైన, ప్రజాః=జనులను, అధఃకుర్వన్ = మహిమచే తిరస్కరించినవాఁడై, కస్మింశ్చిత్ = ఒకానొక, పర్వణి = కాలమందు, అహిభయాకులః - అహిభయ = తనపక్షమందుఁగలిగిన భయముచేత, ఆకులః=దుఃఖముగల వాఁడు, భవేత్ = అగుచున్నాఁడు.

అర్థాంతరము. సర్వాః = సమస్తమైన, ప్రజాః=(భూమియందుగల) ప్రజలను, అధఃకుర్వన్ = క్రిందుచేయుచు, అనఁగా తాను మింటనుండుటచే జనులను క్రిందుగాఁ జేయుచు, బహుధా మహిమోల్బణః-బహు=అనేకములైన యోషధులుమొదలగువానికి, ధామ=ఆశ్రయమైన, హిమ=మంచుచేత, ఉల్బణః=ఎక్కువైనట్టి, రాజా=చంద్రుఁడు, కస్మింశ్చిత్ = ఒకానొక, పర్వణి = పూర్ణిమాప్రతిపత్సంధియందు, అహిభయాకులః - అహి = సర్పాకారుఁడైనరాహువువలన, భయ = భీతిచేత, ఆకులః = చింతగలవాఁడు, భవేత్ = అగును.

తా. భూలోకమందు గల జనుల నందఱను గ్రిందుగానుండునట్లుచేసి నింగిని వెలుంగుచుండు చంద్రుఁడు ఒకానొక పర్వకాలమున రాహుగ్రహముచే గ్రసింపఁబడు నట్లు, తనబాహుబలిమిచే జనులనందఱను ధిక్కరించియుండురాజు, ఒకానొక కాల మందు రాష్ట్రములోఁగలిగిన కలతచేత చిక్కువడును. శ్లో. "హిరణ్య ధాన్య వస్త్రాణి వాహనాని తథైవచ, తథాన్యే ద్రవ్య నిచయాః ప్రజాత స్సంభవ న్తిహి, వార్తాం ప్రసా ధయేన్నిత్యం వార్తాయై లోకసంశ్రయః, ప్రజాయాం వ్యసనస్థాయాం నకిఞ్చిదపి సిద్ధ్య తి." అని కామందకము. బంగారు, ధాన్యము, వస్త్రములు, వాహనములు మొద లగునవియన్నియు రాజునకుఁ బ్రజలవలననే కలుగుచున్నవిగాన యట్టిప్రజలు విరక్తులై నచో రాజునకు తొందర గలుగుననియు నట్టిప్రజలను రాజు చక్కఁగా పాలించవలయు ననియును భావము.

శ్లో. మహతా కరపాతేన సర్వం వసుమతాం హరన్,
సంపూర్ణోఽప్యశ్నుతే రాజా కలాయాః క్షయ మన్వహమ్. ౪౯

వ్యా.—మహతేతి. సంపూర్ణోఽపి-కోశాదిభిరితి శేషః. రాజా నృపః మహతా అమర్యాదేన కరపాతేన శుల్కాది భాగధేయకల్పనయా హేతునా. ని. 'భాగధేయః కరో బలి'రిత్యమరః-వసుమతాం ధనినాం. ని.'వసు ర్మయూఖాగ్నిధనాభిధేయే' ష్వితిత్య మరః. సర్వం ధనం ఆహరన్ అన్వహం ప్రత్యహం, విభక్త్యర్థేఽవ్యయీభావః.'నపుంసక స్యాదన్యతరస్యా'మితి టచ్ ప్రత్యయ స్సమాసాంతః. కళయా విత్తవృద్ధ్యా.ని. 'కళా శిల్పే విత్తవృద్ధ్యాంచంద్రాంశే శకలేకళే'త్యమరః. క్షయం నాశం అశ్నుతే ప్రాప్నోతి. ప్రకృతిమూలత్వా ద్రాజపద స్యేతి.భావః.

అన్యోఽప్యర్థః. మహతాకరపాతేనకిరణప్రసారణేనహేతునా వసుమతాం తేజ స్వినాం భౌమాదీనాం సర్వం తేజో హర న్నాచ్ఛాదయన్ రాజా చంద్రః అన్వహం కలయా స్వతేజోంశేన క్షయం అశ్నుతే క్షీణో భవతి. క్రమేణ దేవైః పీయమానత్వా దితి భావః.

టీ. రాజా = రాజు, సంపూర్ణోఽపి=ధనాదులచేనిండినవాఁడైనను, మహతా=చాలయొక్కువైన, కరపాతేన - కర=కప్పముయొక్క, పాతేన = కల్పించుటచేత, వసుమతాం=ధనవంతులయొక్క, సర్వం=రొక్కమంతయును, హరన్=అపహరించినవాఁడై, అన్వహం=ఎల్లప్పుడును, కలాయాః=ధనాభివృద్ధియొక్క, క్షయం=నాశమును, అశ్నుతే=పొందుచున్నాఁడు. "కలాశిల్పేవిత్తవృద్ధ్యాం చంద్రాంశే శకలేకలా" అని యమరము.

అర్థాంతరము. మహతా=అధికమైన, కరపాతేన - కర = కిరణములయొక్క, పాతేన=ప్రసరణముచేత, వసుమతాం=తేజస్సుగల గ్రహములయొక్కయు నక్షత్రములయొక్కయు, సర్వం=సమస్తమైనకాంతిని, హరన్=పరిహరించుచుండు, రాజా=చంద్రుఁడు, అన్వహం=సర్వదా, కలయా=తనకాంతిచేత, క్షయం = నాశమును, అశ్నుతే=పొందుచున్నాఁడు.

తా. మిక్కిలియొక్కువయైన కిరణప్రసరణములచేత తేజస్సుగల యితర గ్రహనక్షత్రముల నాచ్ఛాదించుచుండు చంద్రుఁడు కృష్ణపక్షమందు సర్వదా క్షీణించునట్లు తన యధికారము చెల్లుచున్నదని ధనికులవలననుండి హెచ్చైనపన్నును గొనురాజు ధననాశమును జెందును. "శ్లో. యత్పృథివ్యాం వ్రీహియవం హిరణ్యం పశవస్త్రియః, ఏకస్యాపి నపర్యాప్తం తస్మా దతితృషాం త్యజేత్. పరాం వినీతః సముపైతి సేవ్యతాం మహీపతీనాం వినయోహి భూషణం, ప్రవృత్తదానో మృదుసంచరత్కరః కరీవ భద్రో వినయేన శోభతే."అని కామందకము.భూమిలోఁగల భోగ్యవస్తువులన్నియు ఆశగలయొకనికే చాలకుండుటచే రాజగువాఁడు కొంచెముగా పన్నునుతీసికొని ప్రజలను పోషింపవలయుననియు గర్వముచేత తేజోవంతుల నాక్షేపింపరాదనియును భావము. ౪౯

శ్లో. యో హీనస్య ప్రతాపేన రాజా సన్ పరిభూయతే,
సతు నక్షత్రగోష్ఠీషు తేజస్వీతి ప్రకీర్త్యతే. ౫౦

వ్యా.— యఇతి. యః పురుషః స్వయం రాజా సన్ నృపోఽపి హీనస్య ధనాదిభిర్జఘన్యస్య వా నికృష్టస్య రాజ్ఞః ప్రతాపేన పౌరుషేణ పరిభూయతే తిరస్క్రియతే. స తు సోఽపి. తుశబ్దోఽపి శబ్దార్థః. క్షత్రాణాం క్షత్రియాణాం గోష్ఠీషు సల్లాపేషు, క్షత్రియసంఘేష్విత్యర్థః. అథవా క్షత్రగోష్ఠీషు క్షత్రియసభాసు తేజస్వీ పౌరుషవా నితి న ప్రకీర్త్యతే నాఖ్యాయతే యద్యయం తేజస్వీ స్యా త్కథం హీనే నావమన్యేతే త్యర్థాపత్తి రనుమానం వా ప్రమాణ మిత్యర్థః.

అన్యోఽప్యర్థః. య శ్చంద్రః స్వయం రాజా సన్ విరాజమానోఽపి అహీనస్య సర్పశ్రేష్ఠస్య, రాహో రితి యావత్. ప్రతాపేన పరిభూయతే. స చంద్రః నక్షత్రాణాం గోష్ఠీషు సభాసు. ని. 'గోష్ఠీ సభాయాం సల్లాప' ఇతి విశ్వః. తేజస్వీ ప్రకాశవానితి ప్రకీర్త్యతే ఆఖ్యాయతే. పూర్ణస్యైవ చంద్రస్య రాహుణా పరిభూయమానత్వాదితి భావః.

టీ. యః=ఏపురుషుఁడు, రాజాసన్=రాజైనవాఁడైనను, హీనస్య=ధనముచేతగాని కులముచేతగాని హీనుఁడైనరాజుయొక్క, ప్రతాపేన=పౌరుషముచేత, పరిభూయతే=తిరస్కరింపఁబడుచున్నాఁడో, సతు=ఆరాజును, క్షత్రగోష్ఠీషు=క్షత్రియుల పరస్పరవాక్యములందుఁగాని, లేక సభలయందుఁగాని, తేజస్వీతి=పరాక్రమముగలవాఁడని, నప్రకీర్త్యతే=పొగడఁబడఁడు.

అర్థాంతరము. యః=ఏచంద్రుఁడు, రాజా సన్ = ప్రకాశించువాఁడైనను, అహీనస్య = సర్పశ్రేష్ఠముయొక్క, అనఁగా రాహువుయొక్క, ప్రతాపేన = ప్రభావముచేత, పరిభూయతే = తిరస్కరింపఁబడుచున్నాఁడో, సః = అట్టిచంద్రుఁడు, నక్షత్రగోష్ఠీషు = చుక్కలయోలగములందు, తేజస్వీతి= కాంతిగలవాఁడని, ప్రకీర్త్యతే=పొగడఁబడుచున్నాఁడు.

తా. స్వయముగా రాజైనవాఁడు ధనాదులచే హీనుఁడైన యొకనిచే పరాభూతుఁడయ్యెనేని యట్టిరాజును క్షత్రియుల సభలయందు పరాక్రమవంతుఁడని మెచ్చుకొనరు. బలవంతుఁడగునేని యల్పునకు లోఁబడునా యని యనుమానము గలుగునని భావము. చంద్రుఁడు సంపూర్ణముగ ప్రకాశించుచు పౌర్ణమితిథియందే రాహువుచే గ్రహింపఁబడుచున్నాఁడని యర్థము.

శ్లో. ఆరభ్యతే మహత్కార్యం యైః క్షుద్రైరపి పార్థివైః,
తే చక్రవర్తినో భూత్వా జాయన్తే భద్రభాజనమ్. ౫౧

వ్యా.—ఆరభ్యత ఇతి. క్షుద్రైః నికృష్టైరపి పార్థివైః రాజభిః మహ దధికం యత్కార్యం ఉక్తం ఆరభ్యతే ఉపక్రమ్యతే. తే నృపాః, చక్రవర్తిన స్సార్వభౌమాః భూత్వా భద్రస్య మంగళస్య రాజ్యలక్ష్మీరూపస్య భాజనం పాత్రం జాయంతే. చంద్రభాజన మితిపాఠే చంద్ర స్యాహ్లాదనస్య భాజనం జాయతే. స్వయ మల్పోఽపి మహత్కర్మ కృత్వా సార్వభౌమోఽభూ దితి తం సర్వే ప్యాహ్లాదయంతీ త్యర్థః. అథవా చంద్రస్య కర్పూరస్యభాజనం జాయంతే కర్పూరభక్షయోగ్యా భవంతీ త్యర్థః. ని. 'ఘనసారశ్చంద్ర సంజ్ఞ'ఇత్యమరః. 'ఉద్యోగినం పురుషసింహ ముపైతి లక్ష్మీ'రితి భావః.

అన్యోఽప్యర్థః. పార్థివైః పృథివ్యాం సంభూతైః క్షుద్రైస్సూక్ష్మైః, పరమాణుభి ర్యర్థః. మహాన్ ఘటాదేర్యత్కార్యమారభ్యతే. తే పరమాణవః చక్రే చక్రభ్రమణేరి వర్తంత ఇతి తథోక్తా భూత్వా, మృత్పిండత్వేన పరిణమ్య, చక్ర మధిష్ఠాయే త్యర్థః. చందయతీతి చంద్రః, 'చది ఆహ్లాదన' ఇత్యస్మా ద్ధాతోః రాణాదికో రప్రత్యయః. తద్భా జనం జాయంతే భద్రభాజన మితి పాఠస్తు నిగమవ్యాఖ్యానం. తే భాజనం జాయంత ఇత్యయంప్రయోగో 'వేదాః ప్రమాణం' 'స్మృతయః ప్రమాణ' మితివ త్సాధుః.

టీ. క్షుద్రైః=నీచులైన, రాజభిరపి = రాజులచేతనైనను, మహాత్ = ఎక్కు వైన, కార్యం=పని, ఆరభ్యతే=చేయనుద్యమింపఁబడెనేని, తే = ఆరాజులు, చక్ర వర్తినః = సార్వభౌములు, భూత్వా = అయి, * భద్రభాజనం = మంగళమునకుఁ బాత్రముగా, జాయన్తే = అగుచున్నారు.

అర్థాంతరము. పార్థివైః=పృథివియందుఁబుట్టిన, క్షుద్రైరపి = కొంచెములైన పరమాణువులచేతనైనను, మహత్కార్యం = గొప్పదగు ఘటము మొదలగు కార్యము, ఆరభ్యతే = ప్రారంభింపఁబడెనేని, తే=ఆపరమాణువులు, చక్రవర్తినః–చక్ర=కుమ్మర వానిసారెయందు, వర్తినః=ఉండునవియై, అనఁగా ముద్దగాచేయఁబడి చక్రమందుంపఁ బడినవియై, భద్రభాజనం=శుభమైనపాత్రగా, జాయన్తే=అగుచున్నవి. "తేభద్రభా జనం" అనుప్రయోగము, "వేదాః ప్రమాణం స్మృతయఃప్రమాణం"అనునట్లు సాధు వుగా గ్రహింపఁదగు.

తా. మిక్కిలి సూక్ష్మములైన భూపరమాణువులు పిండభావమునుబొంది సారె యందుండి సంతోషకరమైన ఘటాదిమహద్రూపమును బొందులాగున రాజులగువారు కొంచెముబలముగలవారై యుండినను, గొప్పకార్యము నారంభించిరేని సార్వభౌమ పదవిని బొందుదురు. "ఉద్యమేనహి సిద్ధ్యన్తి కార్యాణి నమనోరథైః" "ఉద్యోగినం పురుషసింహ ముపైతి లక్ష్మీః"అని యుండుటచే నెట్టియల్పుఁడైననుచక్కఁగాపాటుబడి గౌరవమును సంపాదించుకొనవలయునుగాని సోమరితనములో నుండరాదు. ౫౧

శ్లో. వశీకరోతి పురుషః సమస్తానపి దానవాక్,
స్వమహిమ్నా తథా హన్తి సమస్తానపి దానవాన్. ౫౨

వ్యా.—వశీఇతి. దానవాక్ వితరణవాన్ పురుషః సమస్తానఖిలా నపి జనాన్ వశీకరోతి స్వాధీనా న్కరోతి. అభూతతద్భావే చ్విః. 'దానేన ద్విషంతో మిత్రాభవం' తీతి శ్రుతేః. తథాపి స్వమహిమ్నా దాతృత్వలక్షణేన సమస్తా నఖిలాన్ దానవాన్

* చన్ద్రభాజనం=ఆహ్లాదమునకుఁగాని, లేక కర్పూరమునకుఁగాని యర్థమగును.

దానవసమానాన్ శత్రూన్ హంతి హింసతి. యథా వశీకరోతి తథా హింసతీత్యర్థః. 'సామ్నా భేదేన దానేన సమస్తై రథవా పృథక్,విజేతుం ప్రయతేతారీ న్న యుద్ధేన కదాచనే'తి మనుస్మరణా దితి భావః.

అన్యోఽప్యర్థః. పూర్ణత్వాత్ పురి శయనా ద్వా పురుషః పరమాత్మా హరిః స్వస్య మహిమ్నా వ్యాపకత్వేన మాయయా వా సమస్తా నపి ప్రాణివర్గాన్ వశీకరోతి స్వ మాయా యత్తాన్ కరోతి. 'మమ మాయాదురత్యయే'తి భగవద్వచనా దితిభావః- తథా స్వమహిమ్నా స్వసామర్థ్యేన దానవాన్ వితరణగుణవాన్ విదారణగుణవా న్వా భూత్వా సమస్తా నపి దానవాన్ దనుజాన్ హంతి. 'పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం, ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగ'ఇతి స్మరణా దితి భావః.

టీ. దానవాన్=ఈవిగల, పురుషః=మనుష్యుఁడు, సమస్తా నపి = అందఱిను, వశీకరోతి=స్వాధీనులనుగాఁ జేసికొనుచున్నాఁడు. తథా=అట్లే, సమస్తానపి=సమస్తమైన, దానవాన్ = రాక్షసతుల్యు లగుశత్రువులను, స్వమహిమ్నా=తమ దానమాహాత్మ్యముచేత, హన్తి=చంపుచున్నారు.

అర్థాంతరము. పురుషః=పూర్ణుఁడగుటచేతను, శరీరములనుండుటచేతను బురుషవాచ్యుఁడగు విష్ణువు, స్వమహిమ్నా=తనగొప్పతనముచేత, లేక మాయచేత, సమస్తానపి =సకలప్రాణిసమూహములను, వశీకరోతి = తనమాయకు లోఁబడినవానినిగాఁ జేయుచున్నాఁడు. తథా=అలాగుననే, దానవాన్ = ఈవిగలవాఁడై, లేక విదారణగుణముగలవాఁడై, సమస్తానపి=సమస్తమైన, దానవాన్=రాక్షసులను, హన్తి=చంపుచున్నాఁడు.

తా. పరమాత్మయగు విష్ణువు తనమాయాబలముచే సకలప్రాణులను వశముచేసికొని సాధురక్షణముకై రాక్షసులను శిక్షించునట్లు.పురుషుఁడు వితరణశీలుఁడై, తనమాహాత్మ్యముచేత నందఱను..వశపఱచుకొని రాక్షసులతో సమానులగుశత్రువులను జయించవలయును.

శ్లో. యత్ర స్మృతేఽపి నారీణాం నిర్వృతిం లభతే మనః,
సదర్పకోపమానానాం సీమా పురుష ఉచ్యతే. ౫౩

వ్యా.—యత్రేతి. యత్ర యస్మిన్ రాజ్ఞి స్మృతే సతి అరీణాం ప్రతిపక్షిణాం మనః కర్తృ నిర్వృతిం సుఖం న లభతే న ప్రాప్నోతి.: సః స్మృతః పురుషః దర్పకోపమానానాం దర్ప స్సాహసం కోపో రోషః రణనిర్వృతివిషయః మానః క్షత్రి

రోఽహ మిత్యభిమానః ఏతేషాం గుణానాం సీమాపరా కాష్ఠే త్యుచ్యతే. నిరతిశయ యుద్ధోత్సాహాదిగుణవానితి కథ్యత ఇత్యర్థః.

అన్యోఽప్యర్థః. యత్ర యస్మిన్ సుందరే పురుషే స్మృతే సతి నారీణాం కామినీనాం మనః చిత్తం నిర్వృతిం సుఖం లభతే. స పురుషః నరః దర్పకః కామః స ఉపమానం యేషాం తేషాం కామసదృశానాం సీమా అవధి రుచ్యతే. గుణినోఽభినంద్యంత ఇతి భావః.

టీ. యత్ర=ఏరాజు, స్మృతేసతి = స్మరింపఁబడినవాఁడు కాఁగా, అరీణాం= శత్రువులయొక్క, మనః=మనస్సు, నిర్వృతిం=సుఖమును, నలభతే = పొందదో, సః పురుషః = ఆరాజు, దర్పకోపమానానాం = సాహస రోష అభిమాన గుణములకు, సీమా=ఎల్లయని, ఉచ్యతే =చెప్పఁబడుచున్నాఁడు. అనఁగా నెక్కువైన యుద్ధోత్సాహాదిగుణములుగలవాఁడని పొగడఁబడుచున్నాఁడు.

అర్థాంతరము. యత్ర=ఏసుందరపురుషుఁడు, స్మృతేసతి = స్మరింపఁబడినవాఁడు కాఁగా, నారీణాం=స్త్రీలయొక్క, మనః = మనస్సు, నిర్వృతిం = సుఖమును, లభతే=పొందుచున్నదో, సఃపురుషః = ఆపురుషుఁడు, దర్పకోపమానానాం-దర్పక = మన్మథునితోడ, ఉపమానానాం=సమాను లగువారికి, సీమా = ఎల్లయని, ఉచ్యతే = పలుకబడును.

తా. ఏరాజును దలంచుకొన్నంతలోనే శత్రువులమనస్సు కలతనొందునో యారాజే సాహసమును రోషమును అభిమానముగల వారలలో శ్రేష్ఠుఁడనియును, ఏపురుషుని దలంచినంతనే స్త్రీలమనంబు సుఖంబునొందునో అట్టిపురుషుఁడే సుందరముగల వారలలో శ్రేష్ఠుఁడనియును భావము.

శ్లో. భ్రమేణ మహితం నీచై ర్గత్వా వాదాయ జీవనమ్,
క్షేత్రే దత్తే ఘటీయన్త్ర మక్షేత్రే బాలిశో జనః. ౫౪

వ్యా.—భ్రమేణేతి. ఘటీయంత్రం నామకూపాదిభ్యో జలోద్ధారణయంత్రం. ని. 'ఉద్ఘాటనం ఘటీయంత్రం సలిలోద్వాహనం ప్రహే' రిత్యమరః. ఘటీయంత్రం కర్తృ స్వయం.నీచైః నీచప్రదేశంగత్వా మహితం పూజితం స్నానాదికర్మార్హం జీవనం జలం కర్మభూతం భ్రమేణ భ్రమణేన హేతునా ఆదాయ క్షేత్రే కేదారాదౌ దత్తే దదాతి.' బాలిశో జనః అజ్ఞో జనః. ని. 'అజ్ఞే మూఢయథాజాత మూర్ఖవైధేయబాలిశా' ఇత్యమరః. నీచై ర్నికృష్టం పురుషం గత్వా తస్మా న్మహితం జీవనం జీవనహేతుం కథం నామ ఆదాయ స్వీకృత్య భ్రమేణ భ్రాంత్యా. అవివేకేనేతి యావత్. అక్షేత్రే

అపాత్రే భ్రాత్రాదా జనే దత్తే దదాతి. ఘటీయంత్రంక్షేత్రే దత్తే బాలిశస్తు అక్షేత్రే దత్త ఇతి ఘటీయంత్రా దపి బాలిశస్య నికృష్టత్వ మితి భావోధ్వన్యతే.

టీ. ఘటీయన్త్రం = ఏతము అను జలయంత్రము, నీచైః = క్రిందుగా, అనఁగా బావిలోనికి, గత్వా = పోయి, మహితం = పూజింపఁదగిన, అనఁగా స్నానాదులకు యోగ్యమైన, జీవనం = నీటిని, భ్రమేణ=తిరుగుటచేత, ఆదాయ=తీసికొని, క్షేత్రే=పంట భూమియందు, దత్తే = విడుచుచున్నది.

అర్థాంతరము. బాలిశః = తెలియనివాఁడు, నీచైః = కొఱగానివానిని, గత్వా = పొంది, మహితం=యోగ్యమైన, జీవనం=బ్రతుకును, ఆదాయ=ప్రయాసచే సంపాదించి, భ్రమేణ=భ్రాంతిచేత, అనఁగా నవివేకముచేత, అక్షేత్రే = పాత్రులుకానియట్టి జనులందు, దత్తే = ఇచ్చుచున్నాఁడు.

తా. జలయంత్రము, లోఁతుగానుండు బావిలోపలికి తిరుగుడు మూలకముగా దిగి అందలి నీటిని పంటభూముల కొసంగుచున్నది. మూర్ఖుఁడగువాఁడు, నీచునియొద్దకేఁగి వానివలన తనజీవనమునకు వలయుదానిని గ్రహించి మోహముచే నపాత్రులగు నటులు విటులు వారవధూటులు మొదలగువారికి నిచ్చుచున్నాఁడు. ఇందు మూర్ఖుఁడును జలయంత్రమును నీచజీవన గ్రహణమందు సమానులైనను జలయంత్రము సుక్షేత్రమున కుపయోగమగుటచే అపాత్రుల కుపయోగమగు మూర్ఖునికంటె నుత్తమం బని భావము.

వ్యాఖ్యానమున అపాత్రులగు భ్రాత్రాదులకు మూర్ఖుఁడు జీవనమిచ్చుచున్నాఁడని వ్రాసినారు. భ్రాత్రాదులను అపాత్రు లనుట లోకశాస్త్ర విరుద్ధము కద?

శ్లో. అధిగమ్యాశు గోలక్ష మేకశ్శామ్యతి మార్గణః,
అధిగమ్యాశు గోలక్ష మేకశ్శామ్యతి మార్గణః. ౫౫

వ్యా.—అధిగమ్యేతి. ఆశుగః శీఘ్రగామీ ఏకో మార్గణశ్శరః. ని. 'కలంబ మార్గణశరా' ఇత్యమరః. లక్షం శరవ్యం అధిగమ్య ప్రాప్య. ని. 'లక్ష్యం లక్షం శరవ్యం' చేత్యమరః. శామ్యతి-గచ్ఛతీ త్యర్థః. ఏకః అన్యో మార్గణః యాచకః ఆశు శీఘ్రం యాచ్నాకాల ఏవ గవాం పశూనాం, ధేనూనా మిత్యర్థః. లక్షం-లక్షసంఖ్యా గావ ఇత్యర్థః. అధిగమ్య లబ్ధ్వా శామ్యతి అతృష్ణో భవతి. సముద్గకయమకం.

టీ. ఆశుగః = శీఘ్రముగా పోవుచుండు, ఏకః = ఒకటైన, మార్గణః = బాణము, లక్షం = గుఱిని, అధిగమ్య = పొంది, శామ్యతి = శాంతిని బొందుచున్నది.

అర్థాంతరము. ఏకః=వేఱొకటైన, మార్గణః=యాచకుఁడు, ఆశు=శీఘ్రముగా, గోలక్షం = లక్షగోవులను, అధిగమ్య = సంపాదించి, శామ్యతి = సంతుష్టిని బొందుచున్నాఁడు.

తా. బాణమువలెనే తిరుగుచునుండు యాచకుఁడు బాణమేలాగున గుఱిని కెంది యూరకుండునో, అట్లే యాచకుఁడును లక్ష గోవులను సంపాదింపకగాని శాంతిని బొందఁడు. ఇందు సముద్గకయమక మను శబ్దాలంకారము గలదు. మఱియు నీశ్లోకము గోమూత్రికాబంధమునకును దగియున్నది.

శ్లో. ఇన స్సఏవ సేవ్యోయ స్స్వలోకేన సుధా ముచా,
ద్విజేన్ద్రమణ్డలం క్షీణం సమగ్రయతి సంపదా. ౫౬

వ్యా.—ఇనఇతి. సుధాం సుధోపమా న్వ్యవహారాదీ న్ముంచతి దదాతీతి సుధాముక్ తేన సుధాముచా స్వలోకేన స్వేషాం స్వకీయానాం బంధూనాం లోకేన జనేన స ఏవ సాన్యః ఇనః ప్రభుః. ని. 'ఇన స్సూర్యే ప్రభా'విత్యమరః. సేవ్యః ఆశ్రయణీయః యః ప్రభుః క్షీణం దరిద్రం ద్విజేంద్రాణాం విప్రోత్తమానాం మండల సమూహం సంపదా స్వకీయయా కరణేన సమగ్రయతి సమృద్ధం కరోతి. సమగ్రశబ్దా త్తత్కరోతీతి ణ్యంతా ల్లట్.

అన్యోఽప్యర్థః. స్వస్య లోకః స్వజనః, భక్తజన ఇత్యర్థః. తేన స్వలోకేన కర్త్రా స ఏవ ఇనః సూర్యః సేవ్యః ఉపాస్యః, య స్సూర్య స్సుధాముచా చంద్రకిరణ రూపేణ అమృతస్రావిణ్యా సంపదా కిరణసమృద్ధ్యా క్షీణం నష్టకళం ద్విజేంద్రమండలం చంద్రబింబం సమగ్రయతి సంపూర్ణం కరోతి, శుక్లపక్షే సూర్యః ఖలం స్వతేజసా వర్ధయతి. అత్ర వరాహమిహిరః. 'సలిలమయే శశిని రవే ర్దీ ధయో మూర్ఛితా స్తమో నైశం, క్షపయంతి దర్పణోదరనిహితా ఇవ మందిరస్యాంతః.'

టీ. యః=ఏపురుషుఁడు, క్షీణం = దరిద్రమైన, ద్విజేన్ద్రమండలం—ద్విజేన్ద్ర =బ్రాహ్మణోత్తములయొక్క, మణ్డలం = సమూహమును, సంపదా = సమృద్ధిచేత, సమగ్రయతి = పూర్ణునిగాఁజేయుచున్నాఁడో, సఏవ = అట్టి, ఇనః=దొర, సుధాముచా=పాలునుబోలి పలుకునట్టి, స్వలోకేన=బంధుజనముచేత, సేవ్యః = ఆశ్రయింపఁ దగినవాఁడగుచున్నాఁడు.

అర్థాంతరము. యః=ఏసూర్యుఁడు, సుధాముచా=చంద్రకిరణరూపమైన యమృతమును ప్రవించునట్టి, సంపదా=కిరణసమృద్ధిచేత, క్షీణం=నష్టమైన, ద్విజేన్ద్రమణ్డలం =చంద్రమండలమును, సమగ్రయతి=సంపూ్ర్ణముగాఁ జేయుచున్నాఁడో, సః=అట్టి, ఇనఏవ = సూర్యుఁడే, స్వలోకేన=తనభక్తజనముచేత, సేవ్యః = సేవింపఁదగినవాఁడగుచున్నాఁడు.

తా. అమృతము నుత్పాదించు స్వకిరణములచేత కృష్ణపక్షమందు క్షీణదశనొం దిన చంద్రమండలమును సంపూర్ణముగా నొనర్చు సూర్యుఁడు స్వభక్తజనములచే నెట్లు సేవింపఁదగినవాఁడో యట్లే తనసంపదచేత బ్రాహ్మణులను పూర్ణమనోరథులనుగాఁ జేయు ప్రభువే హితముగాఁ బలుకుచుండుస్వబంధుజనముచేత సేవింపఁదగినవాఁడగుచున్నాఁడు. క్షయమొందిన చంద్రుఁడు సూర్యకిరణములచేతనే మరల కలావంతుఁడగుచున్నాఁడనుట కుఁ బ్రమాణము. "శ్లో.సలిలమయే శశిని రవే ర్దీధితయో మూర్ఛితా స్తమో నైశం, క్షప యన్తి దర్పణోదరనిహితా ఇవ మన్దిరస్యాన్తః." అని వరాహమహిరాచార్యులు చెప్పి యుండుటచే, జలరూపమగు చంద్రమండలమందు సూర్యకిరణములు పడుటవలన నింటి లోపలియద్దమునందు ప్రతిఫలించిన సూర్యకిరణము లాయింటఁగల చీఁకటి నెట్లు హరించునో యట్లే రాత్రి గలిగిన చీఁకటిని పరిహరించు నని తెలియవలయును.

శ్లో. బాల్యే కామ మమృత్తోస్తు వృద్ధస్స్యా దధికం జడః,
స్వాన్తశ్చ కృష్ణరూపశ్చే త్స్యా త్సరాజా ద్విజన్మనామ్. ౨౮

బాల్యఇతి.—బాల్యే అనుపనీతత్వే కామం యథేచ్ఛం అవృత్తో వృత్తిహీ నః, సదాచారరహిత ఇత్యర్థః. అస్తు 'ప్రాగుపనయనా త్కామచారవా' నితి గౌతమ స్మరణాత్. వృద్ధః వార్ధిక్యవాన్ భూత్వా అధిక మత్యర్థం జడః కర్మానుష్ఠానాసమర్థ స్స్యాత్- తథాపి స్వాంతః స్వస్య హృదయే కృష్ణస్య విష్ణోః రూపం ఆకారో యస్య తథోక్తః. స్వహృదయే పరమాత్మోపాసనావాం శ్చే దిత్యర్థః. స పురుషః ద్విజన్మనాం బ్రాహ్మణానాం త్రైవర్ణికానాం వా రాజా స్యాత్. శ్రేష్ఠస్స్యా దితి భావః. సర్వేషాం కర్మణా మప్యాత్మభావనాయాః పరమధర్మత్వా దితి భావః. అత్రాహ యాజ్ఞవల్క్యః. 'ఇజ్యాచారదమాహింసాదానస్వాధ్యాయకర్మణాం, అయం తు పరమో ధర్మో యద్యో గే నాత్మదర్శన' మితి.

అన్యోఽప్యర్థః. బాల్యే శుక్లపక్షాదౌ అవృత్తఃవర్తులహీనః అస్తు, వృద్ధః సంపూ ర్ణకళో భూత్వా అధికం జడః శిశిరః శీత ఇత్యర్థః. ని. 'సుషమ శ్శిశిరో జడ' ఇత్య మరః. స్యాత్ - స్వాంతః స్వమధ్యే కృష్ణరూపః శ్యామాకారః, తస్య కళఙ్కిత్వాదితి భావః, సచంద్రః ద్విజన్మనాం బ్రాహ్మణానాం రాజా స్వామీ ప్రభుః స్యాత్.-'సోమో స్మాకం బ్రాహ్మణానాగ్ం రా'జేతిశ్రుతేః. దర్శపూర్ణమాసాదియాగహేతుతయాచంద్రస్య ద్విజరాజత్వమ్.

టీ. బాల్యే = ఉపనయనము కాకమున్న, కామం=ఇచ్చవచ్చినట్లుగా, అవృ త్తః = ఆచారహీనుఁడు, అస్తు=కావచ్చును. వృద్ధః=ముసలిమై, అధికం=మిక్కిలి,

జడః=అసమర్థుఁడు, స్యాత్ = కావచ్చును. (తథాపి=అట్లయినను) స్వాన్తః = తనహృదయమందు, కృష్ణరూపః = కృష్ణ=విష్ణువుయొక్క, రూపః = ఆకారము గలవాఁడు; అనఁగా పరమాత్మను ధ్యానించువాఁడు, చేత్ = అయ్యెనేని, సః=ఆపురుషుఁడు, ద్విజన్మనాం = బ్రాహ్మణులకు, లేక, బ్రహ్మక్షత్త్రవైశ్యులకు, రాజా=రాజు, స్యాత్=అగును.

అర్థాంతరము. బాల్యే=శుక్లపక్షాదియందు, అవృత్తః = వర్తులములేనివాఁడు, అస్తు = అయినను, వృద్ధః = సంపూర్ణమైన కలగలవాఁడయి, అధికం=మిక్కిలి, జడః = చల్లనైనవాఁడు, స్యాత్=అయినను, స్వాన్తతః=తనమండలమధ్యమందు, కృష్ణరూపః = నల్లనిరూపముగల, సః = ఆచంద్రుఁడు, ద్విజన్మనాం=బ్రాహ్మణులకు, రాజా=దొర, స్యాత్ = అగును.

తా. చిన్నతనమందు పూర్ణచంద్రుఁడు కావందున వర్తులములేకయున్నను, వృద్ధత్వమనఁగా పూర్ణచంద్రుఁడైనపుడు మిక్కిలి చల్లనైన చంద్రుఁడు మధ్యమందు కళంకముగలవాఁడై బ్రాహ్మణులకు రాజైనచందమున పురుషుఁడు చిన్నతనమందు ఉపనయనముగాక మునుపు ఆచారవిహీనుఁడై యుండినను ముసలితనమున నింద్రియ దౌర్బల్యముచేత నేమియుఁ జేయలేనివాఁడైనను, తనమనమునందు శ్రీకృష్ణమూర్తిని ధ్యానించుచుండెనేని యందఱికంటె శ్రేష్ఠుఁడగును. శ్లో. 'ఇజ్యాచారదమాహింసాదానస్వాధ్యాయకర్మణాం, అయం తు పరమో ధర్మో యద్యోగేనాత్మదర్శనమ్. అనెడియాజ్ఞవల్క్య వచనమువలన నన్నికర్మలకంటె నాత్మభావన శ్రేష్ఠము. ౫౭

శ్లో. విలక్షణతయా రాజా బాల ఏవ భృశోజ్జ్వలః,
లబ్ధ్వా వృద్ధిం ప్రతికలం భాత్యఖణ్డితమణ్డలః. ౫౮

వ్యా.—విలక్షణతయేతి. బాలో రాజా నృపః విలక్షణతయా అసాధారణతయా, సర్వోత్కృష్టగుణత్వేనేతి యావత్, భృశ మత్యర్థం ఉజ్జ్వలః ప్రకాశమానో భవతి ప్రతికలం కళయా విత్తవృద్ధ్యా, వీప్సాయా మవ్యయీభావః. ని. 'కలాశిల్పే విత్తవృద్ధౌ చంద్రాంశే కకలే నల' ఇత్యమరః. వృద్ధిం సంపదం లబ్ధ్వా అఖండితమండలః సమృద్ధదేశ స్సన్ భాతి ప్రకాశతే.

అన్యోఽప్యర్థః. రాజా చంద్రః బాలఏవ రేఖామాత్రరూప ఏవ విలక్షణతయా విగతకళత్వేన హేతునా భృశోజ్జ్వలో భవతి, తథా కళాయాం ప్రతికళం వృద్ధిం లబ్ధ్వా అఖండితమండలః సంపూర్ణమండలో భవతి.

టీ. బాలః=చిన్నవాఁడైన, రాజా=రాజు, విలక్షణతయైన=అందఱికంటె నెక్కువైనమంచిగుణములచేతనే, భృశోజ్జ్వలః-భృశ=మిక్కిలి, ఉజ్జ్వలః=ప్రకాశించువాఁ

డగుచున్నాఁడు. ప్రతికలం=ఘనవృద్ధిచేత, వృద్ధిం=అభివృద్ధిని, లబ్ధ్వా=పొంది, అఖణ్డిత మణ్డలః-అఖణ్డిత=నాశముకానియట్టి, మణ్డలః=దేశముగలవాఁడై, భాతి=ప్రకాశించుచున్నాఁడు.

అర్థాంతరము. రాజా=చంద్రుఁడు, బాల ఏవ=చిన్నవాఁడయ్యును, అనఁగా రేఖామాత్రరూపముగలవాఁడయ్యును,విలక్షణతయా=కళంకములేనికారణముచే, భృశోజ్జ్వలః=మిక్కిలిప్రకాశించువాఁడగుచున్నాఁడు. (తథా=అట్లే) ప్రతికలం=ఒక్కొకకలయందును, వృద్ధిం=అభివృద్ధిని, లబ్ధ్వా=పొంది, అఖణ్డితమణ్డలః = సంపూర్ణబింబముగలవాఁడై, భాతి=వెల్గుచున్నాఁడు.

తా. చంద్రుఁడు శుక్లపక్షపాడ్యమినాఁడు రేఖామాత్రదృశ్యమానుఁడై కళంకరహితుఁడై మిక్కిలి ప్రకాశించుచు, దినదినము కలావృద్ధిగలిగి యెట్టిధమున సంపూర్ణబింబముతో. తేజరిల్లునో,అట్లే రాజగువాఁడు బాల్యమందే సర్వోన్నతములైన శౌర్యాదార్యాది సద్గుణములుగలవాఁడై ధనాభివృద్ధిచే నఖండమండలాధిపత్యంబు వహించి ప్రకాశించుచున్నాఁడు. ౫౮

శ్లో. ముక్తా మృణాళ సుధియాం నిర్మలానాం నిసర్గతః,
ఛిద్రం యది స్యాత్తత్ క్షుద్రం తద్గుణై రపిధీయతే. ౫౯

వ్యా.—ముక్తాః మౌక్తికాని, మృణాళాని బిసాని, సుధియః విద్వాంస శ్చ, తేషాం నిసర్గతః స్వభావేన నిర్మలానాం స్వచ్ఛానాం అన్యత్ర స్వచ్ఛచిత్తానాం ఛిద్రం రంధ్రం అన్యత్రఛిద్రం, దోషలేశ ఇత్యర్థః. స్యాత్ భవే చ్చేత్, తర్హి తచ్ఛిద్రం వివరం దోషః క్షుద్రం సూక్ష్మం తద్గుణై స్తంతుభిః అన్యత్ర శాంత్యాదిగుణైః అపిధీయతే ఆచ్ఛాద్యతే. వేధితాని మౌక్తికాని సూత్రప్రోతాని భవంతి మృణాళరంధ్రాణి స్వతంతుభి రాచ్ఛాద్యంతే. 'ఏకో హి దోషో గుణసన్నిపాతే నిమజ్జతీందోః కిరణే ష్వివాంక' ఇతి న్యాయాత్.

టీ. నిసర్గతః = స్వభావమువలన, నిర్మలానాం = నిర్దోషములైనట్టి, అనఁగా స్వచ్ఛములైనట్టి, ముక్తామృణాళసుధియాం-ముక్తా=ముత్యములకు, మృణాళ=తామర తూండ్లకు, సుధియాం=విద్వాంసులకు, క్షుద్రం=కొంచమైన, ఛిద్రం = రంధ్రమును, దోషమును, స్యాద్యది=కలిగెనేని, తత్క్షుద్రం=అరంధ్రమును, దోషమును, తద్గుణైః - తత్ = వానియొక్క, గుణైః=సూత్రములచేతను, మంచినడతలచేతను, అపిధీయతే= కప్పఁబడుచున్నది.-

తా. స్వభావముచేత నే తెల్లనైనముత్యములకును తామరతూండ్లకును స్వభావముచేత నే దోషరహితులైన విద్వాంసులకును ఛిద్రములు అనఁగా ముత్తామృణాళములకు రంధ్రములును విద్వాంసులకు దోషమును కలిగినయెడల, ఆదోషములు ముత్తామృణాళములకు వానియందలి సూత్రముచేతను, విద్వాంసులకు వారిసుగుణములచేతను ఆచ్ఛాదింపఁబడుచున్నది. ముత్యములకు దారము, తామరతూండ్లకు వానియందలి నూలును, విద్వాంసులకు వారిసుగుణములును, ఆరంధ్రదోషములను పోఁగొట్టును. "ఏకోహి దోషో గుణసన్నిపాతా న్నిమజ్జతీందోః కిరణేష్వివాఙ్కః" అను న్యాయమున జగదాహ్లాదకరుఁడైన చంద్రునియందుండు కంౘెవ్విధమున నెన్నఁబడదో, అట్లేయనేకసుగుణములుండి యొకానొక దోషముండినను బయలుపడదు.

శ్లో. వివృణ్వతీ పురస్తైక్ష్ణ్యం పృష్ఠతః కుర్వతీ గుణమ్,
కర్ణాక్ విధతి లోకస్య సూచీవాసూచికస్య వాక్. ౬౦

వ్యా.—వివృణ్వతీతి. సూచకః పిశునః సః న భవతీత్యసూచకః తస్య వాక్ కర్త్రీ పురః ప్రథమోపదేశసమయే తైక్ష్ణ్యం పారుష్యం వివృణ్వతీ ప్రకాశయతీ పృష్ఠతః పశ్చా దుపదేశానంతరం గుణం హితం కుర్వత్యపి లోకస్య జనస్య, అవివేకిన ఇతి శేషః. కర్ణాక్ విధతి భినత్తి, శ్రుతివిరసా భవంతీతి యావత్. 'హితం మనోహారి చ దుర్లభ' మితి భావః కథం? సూచీవ. సాఽపి పురః అగ్రే తైక్ష్ణ్యం తేజస్త్వామత్వం వివృణ్వతీ పృష్ఠతః చరమభాగే గుణం తంతుం కుర్వతీ దధతీ సతీ లోకస్య జనస్య కర్ణాక్ విధతి ఛిద్రయతి.

☞ ఈశ్లోకమందు, అసూచికః అని పదవిభాగము చేసినారు. సూచికిని వాక్కునకు నుపమానోపమేయభావ ముండుటచే నసూచిక వాక్కునకుపమానము పొసంగదు. కాన, తొలుత వ్యాఖ్యననుసరించి యరమునువ్రాసి, పిదప నాయభిప్రాయార్థమును వ్రాయుచున్నాఁడను.

టీ. అసూచికస్య = కొండెము చెప్పనివానియొక్క, అనఁగా సజ్జనునియొక్క, వాక్ = మాట, పురః=ప్రథమోపదేశ సమయమందు, తైక్ష్ణ్యం=కఠినభావమును, వివృణ్వతీ = ప్రకాశపఱచునదియై, పృష్ఠతః=ఉపదేశానంతరమందు, గుణం=హితమును, కుర్వతీ=చేయునదియై, లోకస్య=జనముయొక్క, అనఁగా నవివేకులయొక్క, కర్ణాక్ = చెవులను, పురః = ముఖమందు, తైక్ష్ణ్యం =వాడితనమును, వివృణ్వతీ = విస్తరించునదియై, పృష్ఠతః=వెనుకప్రక్క, గుణం = దారమును, కుర్వతీ = ధరించుచు, లోకస్య = జనముయొక్క, కర్ణాక్ = చెవులను, సూచీవ = సూదివలెనే, విధతి = బాధుచున్నది. అనఁగా వినుటకసహ్యమగుచున్నది.

తా. మొనగల ముఖభావమును వెనుక దారమునుగల సూదివలెనే హితవాది యగువాఁడు హిత ముపదేశించు వేళలో పరుషముగా పలుకుచు పరోక్షమందు మంచి గుణములనే చెప్పుచు చెవిని వేధించుచున్నాఁడని యర్థము. "హితం మనోహారిచ దుర్లభం వచః" అనున్యాయమున లోకమందు ఇష్టమును హితమును అయిన పలుకరుదనిభావము.

అర్థాంతరము. సూచికస్య=కొండెముచెప్పువానియొక్క, వాక్=పలుకు, పురః= జనులముందర, తైక్ష్ణ్యం=దోషోద్ఘాటనముచేతనైనకాఠిన్యమును, వివృణ్వతీ=విస్తరించునది యై, గుణం = మంచినడతను, పృష్ఠతః = వెనుకకు, అనఁగా ప్రకాశముకానట్లుగా, కుర్వతీ= చేయునదియై, లోకస్య = వినువారియొక్క, కర్ణౌ=చెవులను, సూచీవా = సూదివలెనే, విధతి = గ్రుచ్చుచున్నది.

(సూచీపరమైన యర్థము మొదటనే వ్రాయఁబడి యున్నది.

తా. ముఖమందు మొనగలదియై వెనుకప్రక్కదారముగలదియై చెవులను గ్రుచ్చి నొప్పించునట్టి సూదివలెనే కొండెముచెప్పువానివాక్కు ముఖమున పరుషము గలదియై గుణమును ప్రకాశపఱచక వినువారిచెవుల కసహ్యముగా నుండునని భావము. ఈ శ్లోక మందు, 'సూచీవా సూచికస్య వాక్' అనుచోట, సూచీ+ఇవ+అసూచికస్య, అనియే సంధిచేయ పనిలేదు. "ఇవార్థే వశబ్దో వాశబ్దోవా బోధ్యః" అనువార్తికమువలనను, "వావి కల్పోపమానయోః" అను నానార్థరత్నమాలా వాక్యమువలనను, సూచీ-వా-సూచికస్య అని వ్యస్తపదముగానే తెలియ వలయును. వశబ్ద వాశబ్దము లుపమానవాచకమునందు వర్తించును. ఇందులకు ప్రయోగము:—'మణీవోష్ట్రస్యలంబేతే ప్రియావత్సతరామమ' ఇట "య్వోద్విత్వే" "ఈకారాంత-ఊకారాంత ఏకారాంతశబ్దోద్విత్వే వర్తమానః సంధిం నప్రాప్నోతి మణీవాదివర్జ్యమ్" అని సారస్వతవ్యాకరణమందు ప్రకృతి భావ సంధియందుచెప్పి, మణీ-ఇవ-అనియే చెప్పవలయు ననియు, కాశిక యందును ఇట్లే మణీవ-జంపతీవ-దంపతీవ, అని సంధిగా చెప్పియుండినను, సిద్ధాంతకౌముదియందు 'ఈదూదేద్ద్వివచనంప్రగృహ్యమ్" అను సూత్రవృత్తియందు "వశబ్దో-వాశబ్దోవా బోధ్యమ్" అని ఈ స్పష్టముగాచెప్పినారుగాన, వాశబ్ద ముపమానవాచకమనుట కేసందియం బును లేదు.

శ్లో. యోగిధీ రర్కదీప్తిశ్చ ప్రాచీనతమసః క్షయాత్,
క్రమా ద్దీప్తాపరాం కాష్ఠాం యాతి కామం విహాయసా. ౭౧

వ్యా.—యోగిధీరితి. యోగినాం ధ్యానవతాం ధీః కర్త్రీ ప్రాచీనస్య ప్రాగ్భ వస్య తమసః అజ్ఞానస్య క్షయా ద్ధేతోః కామం, ఉపలక్షణ మిదం, కామాదీ నిత్యర్థః.

విహాయ త్యక్త్వా అథవా క్రోధాదీనాం కామమూలతయా తత్త్యాగే సతి తదనుదయా
త్కామస్య గ్రహణం. క్రమా ద్యమాద్యనుష్ఠాన క్రమేణ దీప్తా హృదయే జ్వలితా సా
ధీః పరాం నిరతిశయాం కాష్ఠా ముత్కర్షం బ్రహ్మభూయలక్షణం యాతి ప్రాప్నోతి. ని.
'కాష్ఠోత్కర్షే స్థితౌ దిశీ'త్యమరః. అర్కదీప్తిశ్చ సూర్యతేజోఽపి ప్రాచీనస్య పూర్వ
దిక్స్థితస్య తమసోంధకారస్య క్షయాత్ దీప్తా ఉజ్వలా సతీ క్రమాత్ ఘటికాదిక్ర
మాత్ కామం పర్యాప్తం విహాయసా గగనమార్గేణ పరాం కాష్ఠాం వారుణీం దిశం
యాతి అస్తం గచ్ఛతి - 'లంఘ్యతే న ఖలు కాలనియోగ' ఇతిభావః.

టీ. ప్రాచీనతమసః-ప్రాచీన=పూర్వజన్మమువలనఁ గలిగిన, తమసః = అజ్ఞానము
యొక్క, క్షయాత్ =నాశమువలన, కామం=కామక్రోధాదులను, విహాయ=విడిచి, క్ర
మాత్ = యమ నియమాద్యనుష్ఠాన క్రమముచేత, దీప్తా=హృదయమందు ప్రకాశించు
చుండు, సా = అట్టి, యోగిధీః-యోగి = ధ్యానమును జేయువారియొక్క, ధీః =
బుద్ధి, పరాం=ఎక్కువైన, కాష్ఠాం=శ్రేష్ఠత్వమును, యాతి=పొందుచున్నది.

అర్థాంతరము. అర్కదీప్తిశ్చ-అర్క = సూర్యునియొక్క, దీప్తిశ్చ = కాంతి
యును, ప్రాచీనతమసః=పూర్వదిక్కునందలి చీఁకటియొక్క, క్షయాత్ =నాశమువలన,
ప్తా=ప్రకాశించినదియై, క్రమాత్ = కాలక్రమముచేత, కామం=సంపూర్ణముగా,
హాయసా=ఆకాశమార్గముచేత, పరాం కాష్ఠాం=పడమటిదిక్కును, యాతి=పొందు
చున్నది. అనఁగా అస్తమించుచున్నదనుట.

తా. ప్రాచీనమైన తమస్సును పరిహరించుటవలనను కామాదులను విడుచుట
వలనను యోగియొక్క బుద్ధి మిక్కిలి శ్రేష్ఠత్వమును బొందునటుల సూర్యుని కాంతి
యును ప్రాచీన తమస్సును (తొలిదిక్కు చీఁకటిని) పరిహరించి యాకాశమార్గముచేత
పడమటిదిక్కును బొందునని భావము.

శ్లో. కుముదైశ్చ కుభూపైశ్చ వనే సంకుచితైరపి,
ప్రాప్యతే సా వికాస శ్రీ రాభిముఖ్యం గతే విధౌ. ౬౨

వ్యా.—కుముదై రితి. వనే జలే సంకుచితై రపి కుముదై స్సితోత్పలైః-కుము
దగ్రహణ మిందీవరాణా మ ప్యుపలక్షణం, గుణసామ్యాత్, విధౌ చంద్రమసి. ని.
'విధు ర్విష్ణౌ చంద్రమసీ' త్యమరః, ఆభిముఖ్యం గతే సతి వికాసస్య ప్రఫుల్ల తాయాః
శ్రీః ప్రాప్యతే చ, చంద్రమసి ఉదయతి కుముదాని వికసంతీత్యర్థః. వనే కాననే సంకు
చితై రపి లీనై రపి భూపైః విధౌ భాగ్యే విష్ణౌ వా ఆభిముఖ్యం గతే సతి ఫలతి సత్కీ

అత్ర ప్రసన్నే సతి వికాసస్య ఐశ్వర్యాదిహేతుకస్య శ్రీః ప్రాప్యతే, అదృష్టం కేనాపి దుర్నివార్య మిత్యర్థః.

టీ. వనే=జలమందు, సంకుచితైరపి=ముడుచుకొనియుండునవియైనను, కుము దైః=తెల్లకలువలచేతను నల్లకలువలచేతను, విధౌ=చంద్రుఁడు, ఆభిముఖ్యం=అభిముఖ భావమును, గతేసతి=పొందినవాఁడుకాఁగా,సా=ప్రసిద్ధమైన, వికాసశ్రీః=వికసనసమృ ద్ధిని, ప్రాప్యతే=పొందఁబడుచున్నది.

అర్థాంతరము. వనే=అడవియందు, సంకుచితైరపి = అణఁగికొనియుండువారై నను, కుభూపైః = అసమర్థులగు రాజులచేత, విధౌ = భాగ్యము, లేక విష్ణువు, ఆభి ముఖ్యం=ప్రసన్నభావమును, గతేసతి=పొందుచునుండఁగా, సా=ప్రసిద్ధమైన, వికాస శ్రీః=ఐశ్వర్యమును విస్తరింపఁజేయుసంపద, ప్రాప్యతే=పొందఁబడుచున్నది.

తా. జలమునందు ముకుళభావమునుబొంది తమ వికసనమునకు నేమియుఁ బ్రయత్నమొనరింపక యుండు తెల్లకలువలు మొదలగువానికి తనంతన యుదయమైన చంద్రునివలన వికాససంపద గలిగినట్లు, గ్రహచారవశమునన డవియందు దాఁగియుండు దీనులైనరాజులకు అదృష్టవశమున రాజ్యసంపదలు గలుగుచున్నవనియర్థము. "యద్భావి తద్భవత్యేవ యదభావి న తద్భవేత్" అను నియతి ననుసరించి ఫలప్రాప్తివిషయమందు అదృష్టమే బలమైనదికాని, పురుషప్రయత్నము ప్రయోజనకారికాదు. ౬౨

శ్లో. భూభుజా మమ్బుజానాం చ పత్త్రకోశవతా మపి,
దోషాన్వయా ద్వ్యసనినాం సంకుచన్తి ధ్రువం శ్రియః. ౬౩

వ్యా.—భూభుజామితి. పత్త్రం వాహనం, అశ్వసమూహ ఇత్యర్థః. కోశః అర్థౌఘః తద్వతాం పత్త్రకోశవతా మపి. ని. 'పత్త్రం వాహనపక్షయో'రిత్యమరః. భూభుజాం రాజ్ఞాం శ్రియః సంపదః వ్యసనినాం మృగయాదివ్యసనవతాం పురుషాణాం దోషాన్వయాత్ సంగదోషసంబంధాత్ హేతోః సంకుచంతి, ధ్రువం నిశ్చితం. పత్త్రేషు దళేషు కోశవతాం కుట్మలవతాం, ముకుళితానా మిత్యర్థః. వ్యసనినాం, ఆప ద్వతాం భ్రేశ్యతాం వా. ని. 'వ్యసనం విపది భ్రంశ' ఇత్యమరః, అంబుజానాం పద్మా నాం శ్రియః నస్యతాః దోషాన్వయా ద్రాత్ర్యాగమా ద్ధేతోః సంకుచంతి భ్రశ్యం తి, ధ్రువం. రాత్రౌ పద్మానా మవికాసా దితి భావః.

టీ. పత్త్రకోశవతామపి-పత్త్ర = వాహనములు, కోశవతాం = బొక్కసముగల, భూభుజాం=రాజులయొక్క, శ్రియః = సంపదలు, వ్యసనినాం=వేఁటమొదలగు వ్యసన

ములుగల పురుషులయొక్క, దోషాన్వయాత్=సహవాసదోష సంబంధమువలన, సంకు చన్తి=సంకోచమును బొందుచున్నవి. అనఁగా నాశ మగుచున్నవి.

అర్థాంతరము. పత్త్రకోశవతామపి-పత్త్ర=దళములందు, కోశవతా మపి=ముకుళనము గలిగియుండినను, వ్యసనినాం=ఆపదబొందిన, అనఁగా శిథిలమగుచునుండు, అంబుజానాం = తామరలయొక్క, శ్రియః=నూతన వికసనాదిసంపదలు, దోషాన్వయాత్ - దోష=రాత్రియొక్క, అన్వయాత్ = రాకడవలన, సంకుచన్తి=తగ్గుచున్నవి, ధ్రువం =సత్యము.

తా. ఏనుఁగులు గుఱ్ఱములు మొదలగు వాహనములును బొక్కసమును గలిగియున్నను స్త్రీద్యూతపానాదివ్యసనాసక్తులగు వారితోఁడఁగూడిన దోషమువలన, రాజుయొక్క సంపదలు నశించు చున్నవి. “శ్లో. వీతవ్యసన మశ్రాంతం మహోత్సాహం మహామతిం, ప్రవిశన్తి సదాలక్ష్మ్యః సరిత్పతి మివాపగాః, సత్త్వబుధ్ధ్యుపపన్నోఽపి వ్యసనాసక్తమానసః, శ్రీభి ష్షణ్ఢఇవస్త్రీభి రలసః పరిభూయతే.” అని కామందకము. అనఁగా, వ్యసనముల నొందువాఁడు చెడునని భావము. రేకులందు ముకుళనముగల పద్మములు రాత్రిసంబంధమువలన తమకాంతినిఁ బాయుచున్నది.

శ్లో. మన్త్రప్రభావసంపన్నా యే నరేన్ద్రాః సమాహితాః,
నుదం త్యహిభయం నిత్యం వినా దణ్డోద్యమేన తే. ౭౪

వ్యా.—మంత్రేతి. యే నరేంద్రాః రాజానః దండస్య తురీయోపాయస్య ఉద్యమః ప్రయోగః తేన వినాపి నిత్యం అహిభయం స్వపక్షా దుత్పన్నం భయం. ని. ‘మహీభుజా మహిభయం స్వపక్షప్రభవం భయ’ మిత్యమరః. తన్నుదంతి అపనయంతి మంత్రాదిగుణసంపన్నరాజానం శత్రవో బాధితుం న శక్తా ఇత్యర్థః.

అన్యోఽప్యర్థః. యే నరేంద్రాః విషవైద్యాః, గారుడికా ఇతి యావత్. ని. ‘నరేంద్రో వార్థికే రాజ్ఞి విషవైద్యే చ కథ్యత’ ఇతి విశ్వః, మంత్రేణ గారుడాదినా ప్రభావేణ ఔషధశక్త్యా సంపన్నాః అథవా మంత్రస్య ప్రభావేణ సంపన్నా ఇతి వా సమాహితాః ఔషధాదిప్రయోగేఽవహితా శ్చ భవంతి, తే విషవైద్యాః దండోద్యమేన దండస్య ముద్గరాదేః ఉద్యమః ధరణం, దండప్రహార ఇతి యావత్. తేన వినాపి, పృథగ్వినేత్యాదినా తృతీయా, నిత్యమహిభ్యో భుజంగేభ్యో భయం, పంచమీ భయేనేతి సమాసః, నుదంతి అపహరంతి, న మంత్రాదిశక్త్యా గారుడికానాం ధీర స్తీతి భావః.

టీ. యే=ఏ, నరేన్ద్రాః=రాజులు, మన్త్రప్రభావసంపన్నాః-మన్త్ర=ఆలోచనయొక్క, ప్రభావ=మహిమతోడ, సంపన్నాః=కూడినవారై, సమాహితాః=సామాద్యుపాయములందునిశ్చయమైనమనస్సుగలవారో, తే=ఆరాజులు, దణ్డోద్యమేన వినాపి=దణ్డోపాయమును విడిచినప్పటికిని, నిత్యం=నైజమైన, అహిభయం=స్వపక్షమువలన గలిగినభయమును, నుదన్తి=నివారించుచున్నారు.

అర్థాంతరము. యే=ఏ, నరేంద్రాః=విషవైద్యులు, మన్త్రప్రభావసంపన్నాః=మన్త్ర=గారుడాది మంత్రములయొక్క, ప్రభావ=మాహాత్మ్యముతోడ, సంపన్నాః=కూడినవారై, సమాహితాః=ఔషధాది ప్రయోగములందు జాగ్రత్తగలిగి యున్నారో, తే=ఆవిషవైద్యులు, దణ్డోద్యమేన-దండ=కోలచేత, ఉద్యమేన=కొట్టుటచేత, వినాపి=లేకుండినను, నిత్యం=స్వభావసిద్ధమైన, అహిభయం=పామువలనిభయమును, నుదంతి=నివారించుచున్నారు.

తా. దొరతన మొనరించువారు రాజనీతిదెలిసినవారై తమయాలోచనలను గోప్యముగా నుంచుకొని సామాద్యుపాయములచేతనే రాష్ట్రకమాధానమును గావించుచు, దండోపాయమును విడిచియైనను విషవైద్యులగువారు గారుడాదిమంత్రప్రభావముచేత సర్పములవలనిభీతిని నివారించుకొనుచందమున, స్వపక్షమువలని భయమును బాపుకొందురు. ''శ్లో, సామ్నా భేదేన దానేన సమస్తై రథవాపృథక్, విజేతుం ప్రయతేతారీన్ న యుద్ధేన కదాచన.'' అని మనుస్మృతియం దుండుటచే రాజులు సామ దాన భేదములచేతనే శత్రువులను జయించవలయునుకాని దండోపాయము సర్వదా కూడదని భావము. ''శ్లో. షాడ్గుణ్య నిశ్చితమతి గ్గుహ్యం గూఢప్రచారవాన్, మన్త్రయే దిహ మన్త్రజ్ఞో మన్త్రజ్ఞై స్సహమన్త్రిభిః, మన్త్రార్థకుశలో రాజా సుఖం భూతిం సమశ్నుతే, విపరీతస్తు విద్వద్భిః స్వతంత్రోఽప్యవధూయతే, ప్రభావోత్సాహశక్తిభ్యాం మన్త్రశక్తిః ప్రశస్యతే'' అని కామందకము. అనఁగా గుప్తమైన యాలోచనయే శ్రేష్ఠ మని తెలియందగు. ౬౪

శ్లో. ప్రభావ మీశ్వరస్యాపి కోదణ్డేన నివర్తయన్,
ప్రాప్నోతి విజయశ్లాఘాం నరః పౌరుష మాశ్రితః. ౬౫

వ్యా.—ప్రభావమితి. పౌరుషం పురుషకారం ఆశ్రితః కో వానరః మనుష్యః. కర్తా ఈశ్వరస్య స్వామినః ప్రభావం ప్రకృష్టాం భూతిం. ని. 'భావో లాసక్రియా చేష్టా భూత్యభిప్రాయజంతు'ష్వితి యాదవః. దండేనచతుర్థోపాయేన సైన్యేన వా. ని. 'దండో యమే మానభేదే లగుడే యామసైన్యయో' రితి విశ్వః. నివర్తయ న్నపహరన్

విజయశ్లాఘాం విజయనిమిత్తాం స్తుతిం ప్రాప్నోతీతి కాకుః. స్వామిద్రోహిణః పురుష కారం న స్తువంతి జనా ఇత్యర్థః. ఈశ్వరస్య శంభో రపి ప్రభావం సామర్థ్యం కర్మ కోదండేన ధనుషా కరణేన నివర్తయన్, కుతః? పౌరుషం పరాక్రమం ఆశ్రితః నరః అర్జునః. ని. 'నరోఽర్జునే మనుష్యే' ఇత్యజయః, విజయశ్లాఘాం విజయనిమిత్తాం స్తుతిం ప్రాప్నోతి.

టీ. పౌరుషం=పురుషప్రయత్నమును, ఆశ్రితః = పొందినట్టి, కః=ఏ, నరః= మనుష్యుఁడు, ఈశ్వరస్య = స్వామియొక్క, ప్రభావం=శ్రేష్ఠమైన యైశ్వర్యమును, "భావోల్లాస క్రియాచేష్టా భూత్యభిప్రాయ జంతుషు" అని యాదవుఁడు. దణ్డేన=దం డోపాయముచేత, లేక సైన్యముచేత, నివర్తయన్=అపహరించినవాఁడై, విజయశ్లా ఘాం_విజయ=గెలుపునిమిత్తమైన,శ్లాఘాం=పొగడుటను, ప్రాప్నోతి=పొందుచున్నాఁ డు? అనఁగా పొందఁడని కాకువు.

అర్థాంతరము. పౌరుషం=పరాక్రమమును, ఆశ్రితః = పొందినట్టి, నరః=అర్జు నుఁడు, ఈశ్వరస్యాపి=పరమేశ్వరునియొక్క, ప్రభావం = బలమును, కోదణ్డేన=వింటిచేత, నివర్తయన్=నివారించినవాఁడై, విజయశ్లాఘాం విజయ = జయముగలవాఁడ నెడి, శ్లాఘాం=పొగడుటను, ప్రాప్నోతి=పొందుచున్నాఁడు.

తా. ఎవఁడు పురుషప్రయత్నముచే తనయేలికయొక్క సంపదను దండోపా యముచేత నపహరించుచున్నవాఁడో, అట్టిస్వామిద్రోహి యగువాని పౌరుషము నెవ్వ రును కొనియాడరు.

అర్జునుఁడు పరాక్రమమును వహించి తనధైర్య మెఱుంగవలయునని కిరాతవే షముతో వచ్చిన పరమేశ్వరుని సామర్థ్యమును తనగాండీవమనెడి వింటిచేత నివారిం చినవాఁడై విజయుఁడనెడి పొగడ్త నొందె నని భావము. ౬౭

శ్లో. భిక్షాశనో విషాదీచ సుహృద్యస్య ధనేశితుః,
సంస్తూయతే కింపురుషై రపదానకర స్తథా. ౬౮

వ్యా —భిక్షాశనఇతి. ధనేశితుః ధనికస్య యస్య పురుషస్య సుహృ ద్బంధుః సదా అనవరతం అపదాన మనావృత్తం కర్మ కరోతీ త్యపదానకరః. ని. 'అపదాన మనావృత్తకర్మఖండనయో స్తథే'తి విశ్వ. :తథాపి భిక్షయిత్వా యాచయిత్వాఽ శ్నాతీతి భిక్షాశనః, అతఏవవిషాదీ క్లేశవాంశ్చ భవతీతి వాక్యశేషః, స ధనికః పురుషై స్తూయతే కిం? నై వేత్యర్థః. స్వయం ధనికోఽపి,లోభగుణీచే ద్బాంధవే నోపకరోతీతి తం జనా నిందంతీత్యర్థః. యస్య ధనేశితుః కుబేరస్య సుహృత్. శంభు రిత్యర్థః.

భిక్షాశనః; తస్య భిక్షాశనశీలత్వా దితి భావః. తథా ప్యవిషాదీ అక్లేశితః, ఆనందరూపీ త్యర్థః, యద్వా విషాదీ గరళభక్షకః, తత్ప్రవృత్తే ర్లోకోపకారత్వా దితి భావః. అపదానం గజాసురాదిఖండనం కరోతీ త్యపదానకరః స ఏవ పురుషః కింపురుషైః దేవయోనివిశేషైః స్తూయతే-కింపురుషగ్రహణం దేవాద్యుపలక్షణమ్.

టీ. యస్య=ఏ, ధనేశితుః=ధనవంతునియొక్క, సుహృత్ = స్నేహితుఁడు, అపదానకరః-అపదాన = మంచికార్యమును, కరః=చేయువాఁడై, భిక్షాశనః=తిరుపమెత్తి యన్నముదినువాఁడగుటవలన, విషాదీ=దుఃఖముకలవాఁడగుచున్నాఁడో, సః=అట్టిధనవంతుఁడు, పురుషైః=జనులచేత, స్తూయతే కిం=కొనియాడఁబడునాయేమి? అనఁగా లేదనుట.

అర్థాంతరము. యస్య=ఏ, ధనేశితుః=కుబేరునియొక్క, సుహృత్=మిత్రుఁడైన పరమేశ్వరుఁడు, భిక్షాశనః=బికిరమెత్తి యోదనముదినువాఁడైనను, అవిషాదీ=దుఃఖము లేనివాఁడును, అనఁగా ఆనందస్వరూపుఁడనుట, లేక విషాదీ=విషమును భక్షించినవాఁడును, అపదానకరః-అపదాన=ఖండనమును, అనఁగా గజాసురునిఖండనమును, కరసీ=చేయువాఁడును, అయినాఁడో. సః=ఆకుబేరుఁడు, కింపురుషైః = కింపురుషులనెడి దేవతావిశేషములచేత, స్తూయతే=కొనియాడఁబడుచున్నాఁడు.

తా. ఏధనవంతుని మిత్రులు మంచి యాచారములుగలవారై యుండియు బికిరమెత్తితినుటచే దుఃఖితు లగుచున్నారో, ఆట్టిధనవంతుఁడు పురుషులచే కీర్తింపఁబడఁడు. తాను ధనికుఁడై యుండియు మిత్రులకుపకారమొనర్చనివాఁడు జనులచే నిందింపఁబడుచున్నాఁడని భావము.

కుబేరునియొక్క మిత్రుఁడైన పరమేశ్వరుఁడు భిక్షాశనమును లీలచే నంగీకరించి, లోకమున కుపద్రవముచేయుచు నెవరిచేతను పరిహార్యము కానియట్టివిషమును పరిహరించి లోకకంటకులైనగజాసురాది రాక్షసులను జంపినవాఁడగుటచే నట్టివానికి మిత్రుఁడైనయాకుబేరుఁడు కింపురుషులచే స్తుతింపఁబడుచున్నాఁడు. పూర్వమందు దేవదానవులుకూడి సముద్రమును మథించునెడ నందు హాలాహలముద్భవించి లోకములను గాల్పఁగా పరమేశ్వరుండు దానిని మ్రింగెననియు, దారుకావనమందలి ఋషులు గర్వముచే త్రిమూర్తుల నంగీకరించకయుండఁగా వారి మదమణంచుటకు పరమేశ్వరుండు మోహినీరూపమును బూనిన విష్ణువుతోఁగూడి తానత్యంతసుందరాకారముతో భిక్షాటనవ్యాజముచేత నటకేఁగి వారిగర్వమడంచె ననియును స్కాందపురాణకథ గలదు. ౬౬

శ్లో. దుగ్ధస్రోత్యో దురుపానచ్చ ప్రాప్తోఽపి స్నేహసత్క్రియామ్,
స్వామినః పదభఙ్గాయ స్వకాఠిన్యేన కల్పతే. ౬౭

వ్యా.—దుర్భృత్యఇతి. దుర్భృత్యః దుష్టకింకరః, స్వస్వామిద్రోహీతి యావత్, స్నేహేన సౌజన్యలక్షణేన, సత్క్రియాం సత్కారం ప్రాప్తోఽపి, స్వామినా స్నేహేన పాలితోఽపీ త్యర్థః. స్వస్య కాఠిన్యేన దౌర్జన్యలక్షణేన స్వామినః పదస్య స్థానస్య రాజ్యాదిరూపస్య భంగాయ నాశాయ, స్థానచ్యుతయ ఇతి యావత్ - కల్పతే సమర్థో భవతి, 'క్లృపిసంపద్యమానే' చేతి చతుర్థీ. తత్రాలమితి పర్యాయగ్రహణ మితి వృత్తికారః. దుష్టకింకరః స్వామినా పాలితోఽపి తస్మి న్నేవ ద్రుహ్యతీతి భావః. దురుపానత్ దుష్టోపాన దపి, ఉపానన్నామ చర్మనిర్మితపాదుకావిశేషః. సాపి స్నేహేన తైలేన సత్క్రియాం స్నపనరూపం సంస్కారం ప్రాప్తోఽపి స్వస్య కాఠిన్యేన ఆమర్దనేన హేతునా స్వామినః పాదాభ్యాం ధారయితుః పురుషస్య పదభంగాయ వ్రణాదినా చరణభంగాయ కల్పతే సమర్థో భవతి. త త్తస్య స్వాభావిక మిత్యర్థః.

టీ. దుర్భృత్యః=చెడ్డసేవకుఁడు,అనఁగా స్వామిద్రోహి, స్నేహసత్క్రియాం- స్నేహ = చెలిమిచేత, సత్క్రియాం = బహుమానమును, ప్రాప్తోఽపి=పొందినవాఁడై నను, స్వకాఠిన్యేన=తనస్వభావమైన చెఱుపుచేత, స్వామినః=ఏలినయొక్క, పదభఙ్గాయ-పద=రాజ్యాదిరూపమైన యధికారముయొక్క, భఙ్గాయ=నాశముకొఱకు, కల్పతే=సమర్థుఁడగుచున్నాఁడు.

అర్థాంతరము. దురుపానచ్చ=గడుసైనకాలిచెప్పు, స్నేహసత్క్రియాం-స్నేహ=నూనెచేత, సత్క్రియాం=తడుపఁబడెడిసంస్కారమును, ప్రాప్తోఽపి=పొందినదియైనను, స్వకాఠిన్యేన = తన గడుసుతనముచేత, స్వామినః=తన్నుధరించుపురుషునియొక్క, పదభఙ్గాయ-పద=కాలియొక్క, భఙ్గాయ=పుండ్లవలన గలుగునాశముకొఱకు, కల్పతే=సమర్థమగుచున్నది.

తా. స్వభావముచేత గడుసుగానుండు కాలిచెప్పు నూనెచే తడుపఁబడినప్పటికిని నిజకాఠిన్యముచేత మనుష్యునికాళ్ళకు ఒత్తుకొనుటవలన గలుగు వ్రణముచేపాదములను చెఱుచునట్లుల, దుష్టుఁడైనసేవకుఁడు స్నేహముచే సత్కారముఁబొందినవాఁడైనను స్వభావదౌర్జన్యముచేత తనయేలినయొక్క యధికారమునకు భంగకరుఁడగుచున్నాఁడు. చెప్పులకు నూనె [illegible] [illegible] కాళ్ళయందు పుండ్లు గలుగుటయును ప్రసిద్ధంబు.

శ్లో. ప్రసాదాభి[illegible] విస్మర [illegible], ౬౫
సతీనా [illegible] [illegible].

వ్యా.—ప్రసాదేతి. ప్రసాదాతిశయేన మనసో నైర్మల్యాతిశయేన ఆశు శీఘ్రం విస్ఫురంత్యః సర్వాః సంపదః యేషాం తే తథోక్తాః, స్వచ్ఛచిత్తతాయా నిఖిల శ్రేయో హేతుత్వా దితి భావః. సాధవః సజ్జనాః భగవంతోఽపి శ్రీమంతోఽపి. ని. 'భగశ్శ్రీకామమాహాత్మ్యవీర్యయత్నార్కకీర్తిష్వి'త్యమరః. దీనాః లోభినః న భవంతీతి నదీనాః, త్యాగిన ఇత్యర్థః. భవంతీతి శేషః. అత్ర నఞర్థస్య నశబ్దస్య 'సుప్సుపే'తి సమాసః, అత్ర 'లాభా ల్లోభః ప్రవర్తత' ఇతి న్యాయేనాపి శబ్దః ప్రయుక్త ఇత్యను సంధేయం, కథం. సింధవో యథా సముద్రాఇవ. తేఽపి ప్రకర్షేణ సాదః మథనం తస్యాతిశయేన ఆశు విస్ఫురంత్యః సర్వాః సంపదః రమాద్యాః యేషాం తే తథోక్తాః భగవంతో లక్ష్మీవంతః, తస్యా స్తజ్జత్వాదితి భావః. నదీనాం జాహ్నవీప్రభృతీనాం ఇనాః పతయశ్చ భవంతి, తాసా మాశ్రయత్వా త్తస్యేతి భావః.

టీ. ప్రసాదాతిశయేన - ప్రసాద = మనోనైర్మల్యముయొక్క, అతిశయేన = అధికముచేత, ఆశు = వేగముగా, విస్ఫురత్సర్వసంపదః—విస్ఫురత్ = ప్రకాశించు చుండెడు, సర్వ = సమస్తమైన, సంపదః = ఐశ్వర్యముగల, సాధవః - సత్పురుషులు, భగవన్తోఽపి=శ్రీమంతులైనను, ప్రసాదాతిశయేన-ప్రసాద=ప్రకర్షమైన మథనము యొక్క, అతిశయేన = ఎక్కువచేత, ఆశు = శీఘ్రముగా, విస్ఫురత్సర్వసంపదః = ప్రకాశించుచుండు లక్ష్మీ మొదలగు సమస్తసమృద్ధిగలిగి, భగవన్తః = లక్ష్మీగలవారై, నదీనాః - నదీ=నదులకు, ఇనాః = స్వాములైన, సింధవోయథా = సముద్రములవలె, నదీనాః=దీనులుగానివారు, అనఁగా లోభులుగానివారు, భవన్తి=అగుచున్నారు.

తా. మిక్కిలి మథించుటవలన అమృతము కల్పవృక్షములు మొదలైనసమైశ్వర్యములుగలిగి లక్ష్మికి పుట్టినిల్లైప్రకాశించుచు నదులకు నాథులగు సముద్రములవలె, సాధువు లగువారు మనోనైర్మల్యముచేత ప్రకాశించి సమస్తైశ్వర్యములుగలవారై శ్రీమంతులై నను లోభులు కాకుందురు. ఇచట శ్రీమంతులైనను లోభులు కారనుటకు, 'లాభా ల్లోభః ప్రవర్తతే' అను న్యాయముచే లోకమందు లాభము కలుగుచుండఁగా లోభి తనము గలుగు నని భావము.

శ్లో. క్షిపన్తం మార్గణాన్ రోషా త్కృత్రిమం లుబ్ధ మీశ్వరమ్,
ప్రసాద్య నఫలస్యాప్త్యై కల్పతే కోప్యఫల్గునః. ౬౯

వ్యా.—క్షిపంతమితి. రోషా ల్లోభహేతుకాత్ మార్గణాన్యాచకాన్ క్షిపం తం నిరస్యంతం లుబ్ధం లోభినం, 'లుభ గార్ధ్య' ఇతిధాతోః కర్తరి నిష్ఠా, కృత్రిమం కరణేన నిర్వృత్తం, నూతన మితి యావత్. కపటినం వా ఈశ్వరం ప్రభుం ప్రసాద్య

సంతోష్య వా కోఽపి, యాచక ఇత్యర్థః. అఫల్గునః సారభూతస్య. ని. 'అపారం ఫల్గు శూన్యం చే'త్యమరః. ఫలస్య లాభస్య, ని. 'ఫలంబాణాగ్రలాభయో'రితి విశ్వః. ఆప్త్యై ప్రాప్తయే నకల్పతే, లోభినం ప్రభుమాసాద్య యాచకా నాభీప్సితం ప్రాప్నువంతీ త్యర్థః. రోషా స్తోకదానవిషయా త్కోపాత్ మార్గణాన్ క్షిపంతం విసృజంతం కృత్రిమంలుబ్ధం, మాయామృగయువేషధారిణ మిత్యర్థః. ఈశ్వరం శంభుం ప్రసాద్య సంతోషయిత్వా ఫలస్య పాశుపతాస్త్రలాభరూపస్య ఆప్త్యై అఫల్గునః కౌంతేయవ్యతిరిక్తః కోఽపి న కల్పతే నసమర్థో భవతి. అలమర్థయోగే 'నమస్స్వస్తీ'త్యాదినా చతుర్థీ.

అన్యోఽప్యర్థః. రోషాత్ మార్గణా న్బాణాన్ క్షిపంతం, విధ్యంత మిత్యర్థః, కృత్రిమం పత్రాదిచ్ఛన్నదేహత్వా త్కపటినం ఈశ్వరం, క్షమం సమర్థం లుబ్ధం మృగయుం. ని. 'మృగయు ర్లుబ్ధకశ్చ స' ఇత్యమరః. ప్రసాద్య ప్రాప్య, తద్దృష్టిగోచరీభూత్వేత్యర్థః, కోఽపి మృగః అఫల్గునః ఫలస్య బాణాగ్రస్య ఆప్త్యై న కల్పత ఇతి కాకుః.

అన్యోఽప్యర్థః. రోషాత్ లోభహేతుకా ద్ద్వార్జన్యాదిదోషాత్ మార్గణా నస్మత్పక్షో భవే దితి యాచమానాన్ దుర్యోధనాదీన్ క్షిపంతం త్వత్పక్షో న భవామీతి తా న్నిరస్యంతం కృత్రిమం మానుషవేషధారిణం లుబ్ధం విమోహితారం, 'లుభవిమోహన' ఇత్యస్మా ద్ధాతోః కర్తరి నిష్ఠా, ఈశ్వరం భగవంతం,వాసుదేవం ప్రసాద్య ప్రాప్య అఫల్గునః అర్జునా దన్యః కోఽపి పురుషః ఫలస్య కౌరవప్రభృతివధరూపస్య ఆప్త్యై, న కల్పత ఇత్యర్థః. బృహన్నలాయాః కార్యాంతం క్షోదీయా నపి గచ్ఛ తీతిభావః.

టీ. రోషాత్ = లోభత్వమువలనఁగలిగిన కోపమువలన, మార్గణాన్=యాచకులను, క్షిపంతం = తిరస్కరించుచుండు, లుబ్ధం=లోభియైనట్టియు, కృత్రిమం = క్రొత్తయైనట్టియు, లేక కపటముగలట్టియు, ఈశ్వరం=రాజును, ప్రసాద్య=సంతోషపఱిచి, కోఽపి = ఒకానొకయాచకుఁడు, అఫల్గునః=శ్రేష్ఠమైనట్టి, ''అసారం ఫల్గు శూన్యంచ'' అని అమరము. ఫలస్య = లాభముయొక్క, ఆప్త్యై=పొందుటకై, నకల్పతే=సమర్థుఁడు కాఁడు.

తా. ధనాశచే యాచకునిఁగనినంతనే తిరస్కరించుచు లోభత్వముచే మోసతనమున మెలఁగు రాజును సంతోషపఱిచి యెవఁడు తానే శ్రేష్ఠమైనలాభము కొఱకు తగియున్నాఁడు? అనఁగా నెవఁడును తగఁడనుట,

అర్థాంతరము. రోషాత్ = మూకదానవ విషయకమైన కోపమువలన, మార్గణాన్ = బాణములను, క్షిపన్తం = విడుచుచునుండు, కృత్రిమం = కపటముచే వేషము వేసికొనివచ్చిన, లుబ్ధం = కిరాతరూపుఁడైన, ఈశ్వరం = పరమేశ్వరుని, ప్రసాద్య = సంతోషపఱిచి, ఫలస్య = పాశుపతాస్త్రలాభముయొక్క, ఆప్త్యై = ప్రాప్తికొఱకు, ఆఫల్గునః = అర్జునునికంటె వేఱొకఁడు, కోఽపి=ఎవఁడైనను, నకల్పతే = సమర్థుఁడు కాఁడు.

తా. ఇంద్రునిఁ గూర్చి తపంబొనరించునప్పుడు వరాహరూపుఁడైన మూకరాక్షసుని విషయకమైన రోషముచేత బాణములను వేయుచున్న మాయాకిరాతరూపుఁడైనపరమేశ్వరుని సంతోషపఱిచి పాశుపతాస్త్రలాభమును బొందుటకు అర్జునుఁడే సమర్థుఁడు.

మఱియొకయర్థము. రోషాత్=రాజ్యమందలి లోభమువలన, మార్గణాన్=యాచకులైన దుర్యోధనాదులను, క్షిపన్తం = తిరస్కరించుచుండునట్టియు, కృత్రిమం= మాయామానుషవేషమును బూనినట్టియు, లుబ్ధం=మోహింపఁజేయునట్టియు, ఈశ్వరం = భగవంతుఁడైన శ్రీకృష్ణుని, ప్రసాద్య=పొంది, ఆఫల్గునః=అర్జునునకంటె నన్యుఁడు, కోఽపి = ఏపురుషుఁడును, ఫలస్య = కౌరవజయరూపమైన లాభముయొక్క, ఆప్త్యై = ప్రాప్తికొఱకు, నకల్పతే=సమర్థుఁడు కాఁడు.

తా. రాజ్యమపహరింపవలయు ననులోభమువలనఁ బుట్టినరోషముచేత స్వపక్షమునకు సహాయకుఁడుగనుండవలయునని తనను యాచించిన దుర్యోధనాదులను తిరస్కరించి కపటమానుషవేషధారియై భగవంతుఁడైన శ్రీకృష్ణునిఁ బొందియర్జునుఁడు దుర్యోధనాది కౌరవులను జయించెను. చిన్నవాఁడైనను బలవత్సహాయముచే నుద్యుక్తకార్యమును ముగింపఁజేయుననిభావము.

వేఱొకయర్థము. రోషాత్ = కోపమువలన, మార్గణాన్ = అమ్ములను, క్షిపన్తం = గ్రుచ్చునట్టియు, కృత్రిమం = ఆకులు మొదలగువానిచే శరీరమును దాఁచుకొనియుండునట్టియు, ఈశ్వరం=వేఁటయందు సమర్థుఁడైనట్టియు, లుబ్ధం=బోయను, ప్రసాద్య = పొంది, కోఽపి = ఏమృగము, ఆఫల్గునః=సారమైనట్టి, ఫలస్య = బాణాగ్రముయొక్క, ఆప్త్యై=ప్రాప్తికొఱకు, నకల్పతే = సమర్థముకాదా? అనఁగా నగును.

తా. కోపముచే అలుగులను గ్రుచ్చుచు నాకులు మొదలగువానిచే తనయొడలును మఱుఁగుచేసికొని మృగములను వంచించుసమర్థుఁడైన వేఁటకానియొక్క లక్ష్యమును బొందిన ఏమృగమైనను బాణముపాలు కాకపోదు.

శ్లో. అపథేనైవ యో మోహా దన్ధస్సారయతే స్వయమ్,
సీచోపసర్పణవశా త్సపతే ద్వంశవా నపి. ౨౦

వ్యా.—అపథేనేతి. యోంధః, లక్షణయా అజ్ఞ ఇత్యర్థః, నీచానాం నికృష్టానాం, దురాచారిణా మిత్యర్థః. ఉపసర్పణ మనుసరణం తత్ర వశః కాఙ్ఖతరిచ్ఛా యస్య సః తస్మా న్మోహాత్ అజ్ఞానా ద్ధేతోః స్వయ మపథే నామార్గేణ, స్వనిషిద్ధాచారేణే త్యర్థః, విభాషేత్యచ్ సమాసాంతః, స్వయం సారయతే ఇతరజనాన్ వర్తయతే, 'ణిచ' శ్చేత్యాత్మనేపదం, స పురుషః వంశవా నపి కులీనోఽపి పతేత్, నరక ఇతి శేషః. కుల స్యాకించిత్కరత్వా దాచారస్య ప్రాశస్త్యా చ్చేతి భావః.

అన్యోఽప్యర్థః. యోంధః లోచనహీనః పురుషః నీచోపసర్పణవశాత్ నీచేసర్పద్వారాదిప్రదేశే ఉపసర్పణ మనుధావనం తత్ర వశ ఇచ్ఛా యస్య తస్మాత్ మోహా దపథే నైవ అమార్గే ణైవ స్వయం సారయతే గమయతే, అన్యా నితి శేషః. సోఽంధః వంశవా నపి హస్తస్థదండవా నపి, వంశగ్రహణ మతంత్రం, దార్వాదిభి రపి తస్య సుకరత్వాత్. పతేత్, గర్తాదౌ విషమస్థల ఇతి శేషః.

టీ. యః=ఏ, అన్ధః = గ్రుడ్డివాఁడు, అనఁగా తెలియనివాఁడు, నీచోపసర్పణవశాత్ - నీచ = దురాచారులయొక్క, ఉపసర్పణ = అనుసరణమందలి, వశాత్ = కోరికగలయట్టి, మోహాత్ = తెలివిలేమిచే, స్వయం=తనచేతనిషేధింపఁబడినట్టి, అపథేన=దురాచారముచేత, సారయతే=ఇతరులను బ్రవర్తింపఁజేయుచున్నాఁడో, సః= ఆపురుషుఁడు, వంశవానపి=మంచికులమందుపుట్టినవాఁడైనను, పతేత్=నరమందుపడును.

అర్థాంతరము. యః = ఏ, అన్ధ=గ్రుడ్డివాఁడు, నీచోపసర్పణవశాత్-నీచ= బొరియలుమొదలగునవి గలచోట, ఉపసర్పణ = వెంబడించుటయందలి, వశాత్ = ఇచ్ఛగల, మోహాత్ = అజ్ఞానమువలన, అపథేనైవ = చెడ్డత్రోవచేతనే, స్వయం = తాను, సారయతే = నడిపింపఁజేయుచున్నాఁడో, సః = ఆగ్రుడ్డివాఁడు, వంశవానపి= హస్తమందు వెదురుకోలగలవాఁడైనను, పతేత్=వంకలుమొదలగువానియందు పడును.

తా. కన్నులులేనివాఁడు తనచేతియందు వెదురుకఱ్ఱనుబట్టుకొని తెలివిలేక లోయలుగలనేలయందు ఇతరుల నడిపించి తానే తొలుత వంకలోపడువిధంబున, తెలివిలేనివాఁడు దుర్మార్గుల ననుసరింపవలయునను మోహముచే ఇతరులను దురాచారమందు ప్రవర్తింపఁజేసెనేని మంచివంశమందుఁ బుట్టినవాఁడైనను తానే నరకమందు పడును. సత్కులమే ప్రశస్తముకాదు. సదాచారము నుండవలయునని భావము. ౨౦

శ్లో. యః క్షయే వర్తమానాం తాన్వై న్పాలిపుణ్యజనాన్ ధనీ,

లోకే మనుష్యధర్మాణం కిన్నరాః కథయన్తి తమ్. ౭౧

వ్యా.—య ఇతి. యో ధనికః కర్తా క్షయే గృహే వర్తమానాన్, మానిన ఇత్యర్థః. యద్వా క్షయే దారిద్ర్యే వర్తమానాన్ దరిద్రాన్ స్వాన్ స్వకీయాన్ పుణ్యజనాన్ సజ్జనాన్ పాతి రక్షతి. తం ధనికం పురుషం లోకే నరాః మనుష్యాః మనుష్యధర్మాణం మనుష్యమాత్రం కథయంతి కిం? పురుషశ్రేష్ఠ ఇతి వదంతీత్యర్థః. కథం? ధనీ కుబేర ఇవ, సోఽపి క్షయే ఆయోధనాదినాశే వర్తమానాన్ స్థితాన్ స్వాన్ స్వకీయాన్ పుణ్యజనాన్ రాక్షసాన్ పాతి, యుద్ధాభిముఖ మాగతాన్ శత్రూన్ జిత్వా స్వకీయాన్ రక్షతీత్యర్థః. తంకుబేరం లోకే కిన్నరాః దేవయోనివిశేషాః మనుష్యధర్మాణం కుబేరం కథయంతి, గాయంతీతి యావత్, మనుష్యధర్మాణమితి 'ధర్మాదనిచ్కేవలా' దిత్యనిచ్ప్రత్యయ స్సమాసాంతః.

టీ. యః=ఏ, ధనీ = ధనవంతుఁడు, క్షయే = ఇంటియందు, వర్తమానాన్= ఉండువారిని, అనఁగా మానవంతులరు, లేక, క్షయే=లేమితనమందు, వర్తమానాన్= ఉండెడి, స్వాన్ = స్వకీయులైన, పుణ్యజనాన్=సత్పురుషులను, పాతి = కాపాడుచున్నాఁడో, తం = ఆధనవంతుని, లోకే = లోకమందు, నరాః = మనుష్యులు, మనుష్యధర్మాణం = మనుష్యమాత్రుఁడేయని, కథయన్తికిం = చెప్పుచున్నారా ఏమి? అనఁగా నంతియకాదు, పురుషశ్రేష్ఠుఁడని చెప్పుచున్నారు.

అర్థాంతరము. యః = ఏ, ధనీ=ధనవంతుఁడైన కుబేరుఁడు, క్షయే=యుద్ధము మొదలగుదుర్వ్యాపారరాహిత్యమందు, వర్తమానాన్=ఉండెడి, స్వాన్=తనసంబంధులైనట్టి, పుణ్యజనాన్ = రాక్షసులను, అథవా యక్షులను, "పుణ్యజనస్తు సజ్జనే, గుహ్యకే యాతుధానేచ" అని హేమచంద్రుఁడు. పాతి = రక్షించుచున్నాఁడో, తం= ఆకుబేరుని, కిన్నరాః = కిన్నరు లనెడిదేవతలు, మనుష్యధర్మాణం = మనుష్యునివంటి ధర్మముగలవాఁడని, కథయన్తి=గానము చేయుచున్నారు.

తా. తమతమ యిండ్లయందుండియే దుష్కార్యములకుపోక సాధువులుగా నుండునట్టియు,లేక దరిద్రావస్థయందుండునట్టియు స్వకీయులను ఏధనవంతుఁడు పోషించుచున్నాఁడో ఆట్టివానిని లోకమందలిజనులు మానవోత్తముం డని పొగడుచున్నారు. ధనాధిపత్యము వహించియు యుద్ధము మొదలగు చెడ్డ కార్యములు చేయకుండునట్టి తనవారైన రాక్షసులను, అథవా యక్షులను రక్షించునట్టి కుబేరుని కిన్నరులు మనుష్యధర్మము గలవాఁడని పొగడుచున్నారు.

శ్లో. ప్రకృష్టవర్ణతశ్శుద్ధం లబ్ధ్వా హారిం సమేధితః,

తరళత్వేన నత్యాజ్యో మణివ జ్జాతిమాన్ ద్విజః. ౭౨

వ్యా.—ప్రకృష్టఇతి. శుద్ధం పవిత్రం ఆహారం లబ్ధ్వా ప్రాప్య, జగ్ధ్వేత్యర్థః. సమేధితః సమ్యగ్వృద్ధిం ప్రాప్తః, ఆహారశుద్ధే స్తేజో హేతుత్వా దితి భావః, జాతిమాన్ కులీనః ద్విజః విప్రః ప్రకృష్టవర్ణతః తరళత్వేన చాంచల్యేన న త్యాజ్యః న దూషణీయః. ని. 'బ్రాహ్మణా నావమంతవ్యా భస్మఛన్నా ఇవాగ్నయ' ఇతిస్మరణాదితిభావః. కథంః మణివత్ మాణిక్య మివ. సాఽపి శుద్ధం విమలం హారం మౌక్తికదామ లబ్ధ్వా తరళత్వేన హార మధ్య గతత్వేన హేతునా సమేధితః సమ్యగ్వృద్ధిం ప్రాప్తః. ని. 'తరళో హారమధ్యగ' ఇత్యమరః. జాతిమాన్ మరకతాదిరత్నకులోద్భూతః ఏవంవిధో మణిః ప్రకృష్టవర్ణతః ఉత్కృష్ట కాంతిమత్తాయా హేతోః న త్యాజ్యో హేయో న భవతి.

టీ. శుద్ధం=దోషరహితమైన, ఆహార్య = అన్నమును, లబ్ధ్వా = పొంది, అనఁగా భక్షించి, సమేధితః = చక్కఁగా ప్రకాశించుచుండెడి, జాతిమాన్=మంచికుల మందుపుట్టిన, ద్విజః = బ్రాహ్మణుఁడు, ప్రకృష్టవర్ణతః = శ్రేష్ఠకులముగలవాఁడగుట వలన, నత్యాజ్యః = త్యజింపఁదగినవాఁడు కాఁడు.

అర్థాంతరము. శుద్ధం=నిర్మలమైన, హారం=ముత్తెపుసరమును, లబ్ధ్వా=పొంది, తరళత్వేన=హారమధ్యమందలి రత్నభావముచేత, సమేధితః=చక్కఁగా వెలుఁగుచుండెడి, జాతిమాన్=మంచిజాతిగలిగినట్టి, మణివత్ = రత్నమువలెనే, ప్రకృష్టవర్ణతః=మంచి కాంతిగలిగిన కారణమువలన, (సః ద్విజః=ఆబ్రాహ్మణుఁడు) నత్యాజ్యః=విడువఁదగిన వాఁడు కాఁడు.

తా. త్రాసము పటలము మొదలగు దోషములులేని ముత్తెములు మొదలగువానిచేఁ గూర్పఁబడిన హారములమధ్యమందు నాయకమణి కారణముచే చక్కఁగా ప్రకాశించుచు మంచికాంతిగలిగి జాతిరత్నమగుటచేతనామణి యేరీతిగాపోఁగొట్టఁదగినదికాదో, అట్లే పరిశుద్ధమైన యన్నమును భుజించుచు, తేజోవంతుఁడై మంచివంశమందు పుట్టిన బ్రాహ్మణుఁడు శ్రేష్ఠవర్ణుఁడగుటవలన చాంచల్యముచేత విడువఁదగినవాఁడు కాఁడు. "బ్రాహ్మణా నావమంతవ్యా భస్మచ్ఛన్నా ఇవాగ్నయః" అని మనుస్మృతి. బూడిదచే గప్పఁబడిన నిప్పువలెనుండు బ్రాహ్మణుల నవమానింప రాదని భావము. ౭౨

శ్లో. మన్దస్తీక్ష్ణరుచిః పాపః కుజన్మాయశ్చ దేహినామ్,
దుగిఖాయ జన్మభజతే నిధనంచేతి విస్మయః. ౭౩

వ్యా.—మందఇతి. యః పురుషః మందః పరోపకారాదౌ పరమః అథవా మందః అజ్ఞః తీక్ష్ణరుచిః క్రూరబుద్ధిః అతఏవ పాపః పాపిష్ఠః, అర్కఆదిత్యా న్మత్యర్థీ

యో౽౽చ్ఛ్రిత్యయః. కుతః? కుజన్మా అకులీనః, కుత్సితం జన్మ యస్యేతి బహువ్రీహిః, స పురుషః స్వస్య జన్మ కర్మభూతం దేహినాం ప్రాణినాం దుఃఖాయ దుఃఖం కర్తుం ప్రాప్నోతి నిధనం మరణం భజత ఇతి ఏతద్విస్మయః హర్ష హేతుః. ని. 'విస్మయో హర్షగర్వయో'రితి విశ్వః.

అన్యోఽప్యర్థః. యో మందః శనైశ్చరః కుజన్మా భౌమశ్చ, కౌ భూమా జన్మ యస్యేతి వ్యధికరణో బహువ్రీహిః 'అవర్జ్యో వ్యధికరణో బహువ్రీహి ర్జన్మాద్యుత్తర పద' ఇతి వామనః. తీక్ష్ణరుచిః క్రూరతేజాః పాపః పాపగ్రహశ్చ భవతి. అత ఏవ ప్రాణినాం దుఃఖాయ వ్రణాదినా శరీరపీడాం కర్తుం జన్మ జన్మస్థానం భజతే ప్రాప్నోతి. నిధనం అష్టమస్థానం చ భజతే.విస్మయః ఆశ్చర్యం. 'ద్వాదశాష్టమజన్మస్థా శ్శన్యర్కాంగారకా గురుః, కుర్వంతి ప్రాణసందేహం స్థానభ్రష్టం ధనక్షయ' మితి స్మరణా దితి భావః.

టీ. యః = ఏపురుషుఁడు, మన్దః = సోమరితనముచే పరోపకారాదులందు అశక్తుఁడును, లేక, మన్దః=తెలియనివాఁడును, తీక్ష్ణరుచిః = దారుణమైన యభిలాష గలవాఁడు గనుక, పాపః=పాపముగలవాఁడై, కుజన్మా=దుష్కులమందుఁబుట్టినవాఁడో, (సః=వాఁడు) జన్మ = తనపుట్టుకను, దేహినాం = ప్రాణులయొక్క, దుఃఖాయ=కష్టముకొఱకు, భజతే = పొందుచున్నాఁడు. (ఇదిసరియే) నిధనంచ=చావునుకూడ, దేహినాం దుఃఖాయ=ప్రాణులకష్టమునకై, భజతే=పొందుచున్నాఁడు. ఇతి = ఇట్లనుట, విస్మయః=సంతోషకరమైనది "విస్మయో హర్షగర్వయోః" అని విశ్వము.

అర్థాంతరము. యః=ఏ,మన్దః=శనిగ్రహమును, కుజన్మా=అంగారకగ్రహమును, తీక్ష్ణరుచిః = క్రూరమైన తేజస్సుగలవాఁడు, అనఁగా పాపగ్రహ మగుచున్నాఁడు గనుకనే, దేహినాం =ప్రాణులయొక్క, దుఃఖాయ=కష్టముకొఱకు, జన్మ =లగ్నమును, నిధనంచ=అష్టమస్థానమును, భజతే=పొందుచున్నాఁడు, ఇతి = ఇది, విస్మయః = ఆశ్చర్యము.

తా. ఏనరుఁడు పరోపకారాదులు చేయలేక తెలివిలేనివాఁడై, క్రూరాభిలాషియైనవాఁడు గనుక పాపము చేయువాఁడై దుష్కులమందుపుట్టినాఁడో వానిజన్మము జనులదుఃఖముకొఱకును, చావు సంతోషముకొఱకును, అగుచున్నదని యర్థము. దుర్జనుఁడు బ్రతికియుండుటకంటె చచ్చుట మేలనిభావము.

పాపగ్రహములైన శన్యంగారకులు జన్మమందును అష్టమ స్థానమందును ఉండి ప్రాణులకు వ్రణాద్యుపద్రవములను జేయుచున్నారు. ఇందులకు, "శ్లో. ద్వాదశాష్టమ

జన్మస్థాః శన్యర్కాంగారకాగురుః, కుర్వంతి ప్రాణసందేహం స్థానభ్రష్టం ధనక్షయమ్" 23
అని శాస్త్రము.

శ్లో. వేదత్రయ మయోయస్స్యాత్సోఽపి హీనః క్షణా త్పతేత్,
స్వస్యైవ రుచ్యా పీతాయాం వారుణ్యాం సత్పథాత్ చ్యుతః.

వ్యా.—వేదేతి. యో విప్రః వేదత్రయమయః వేదత్రయప్రచురః, వేదత్రయాధ్యయనవాం స్తదర్థవేత్తా చేత్యర్థః. స్యా ద్భవే ద్యది స ఏవంవిధోఽపి ఆత్మన ఏవ రుచ్యా ప్రీత్యా, స్వాభిలషితే నేతి యావత్, వారుణీ సురా. ని. 'సురా హరి ప్రియా హాలా పరిస్రుద్వరుణాత్మజే'త్యమరః, తస్యాం పీతాయాం సత్యాం సత్పథాత్ సదాచారమార్గాత్ చ్యుతః భ్రష్టః అతఏవ హీనః సజాతీయేషు నికృష్టః క్షణాత్ పాన సమయ ఏవ పతేత్ పతితో భవేత్. శ్రౌతాదికర్మానధికారీ స్యా దిత్యర్థః. 'నిత్యం మద్యం బ్రాహ్మణో వర్జయే' దితి గౌతమస్మరణా దితి భావః.

అన్యోఽప్యర్థః. వేదత్రయమయః త్రయీరూపః య స్సూర్యః, 'త్రయ్యేవ విద్యా తపతీ' తి శ్రుతేః, సత్పథాత్ ఆకాశలక్షణా త్ప్రశస్తమార్గాత్ చ్యుతః, గగన మతివ ర్తిత ఇతి యావత్. స్వస్య రుచ్యా తేజసా హీన స్స్యాత్. సోఽపి సూర్యః పీతాయాం వారుణ్యాం ప్రతీచ్యాం పతేత్, అస్తం గచ్ఛే దిత్యర్థః. వరుణో దేవతా అస్యా ఇతి విగ్రహః, 'సాస్య దేవతే'త్యణి టిడ్ఢాణ' జిత్యాదినా జీప్.

టీ. యః=ఏబ్రాహ్మణుఁడు, వేదత్రయమయః=ఋగ్యజుస్సామములనెడిమూఁడు వేదములను చదివి యర్థముదెలిసినవాఁడు, స్యాద్యది = అయినను, సోఽపి = వాఁడు, స్వస్యైవ = తనయొక్కయే, రుచ్యా = అభిలాషచేత, వారుణ్యాం = కల్లు, పీతాయాం సత్యాం=పానముచేయఁబడినదికాఁగా, సత్పథాత్ = మంచి యాచారము వలననుండి, చ్యుతః = జారినవాఁడుగనుకనే, హీనః = స్వజాతిలోతక్కువవాఁడై, క్షణాత్=త్రాగువేళయందే, పతేత్ = పడుచున్నాఁడు. అనఁగా శ్రౌతాది కర్మభ్రష్టుఁడగుచున్నాఁడు.

అర్థాంతరము. వేదత్రయమయః=త్రయీస్వరూపుఁడైన, యః=ఏసూర్యుఁడు, సత్పథాత్ - సత్=నక్షత్రములయొక్క, పథాత్ = మార్గమైన యాకాశమువలన నుండి, చ్యుతః = సాగుచు, స్వస్యైవ = తనయొక్కయే, రుచా = కాంతిచేత, హీనః =తక్కువైనవాఁడు, అనఁగా మందకాంతిగలవాఁడు, స్యాత్ = అగుచున్నాఁడో, సోఽపి = ఆసూర్యుఁడు, పీతాయాం = పచ్చనివన్నెగల, వారుణ్యాం = వరుణసంబంధమైన పడమటి దిక్కునందు, పతేత్ = పడుచున్నాఁడు. అనఁగా అస్తమించుచున్నాఁడు.

తా. ఋగ్యజుస్సామము లనెడి మూఁడువేదములను జదివి వాని యర్థములను దెలిసికొనినవాఁడైనను తనయభిలాషచేత కల్లుద్రాగెనేని సదాచారమువలననుండి జాఱిన వాఁడై బ్రాహ్మణకులమందు హీనుఁడైతత్‌క్షణమందే శ్రౌతాదికర్మభ్రష్టుఁడగుచున్నాఁడు. బ్రాహ్మణుఁడగువాఁడు, నిత్యముగా మద్యమును విడువవలయునని భావము. "నిత్యంమద్యం బ్రాహ్మణో వర్జయేత్" అని గౌతమస్మృతి.

వేదత్రయస్వరూపుఁడైన సూర్యుఁడు ఆకాశమార్గమునఁ దిరుగుచు నస్తమించు కాలమున మందతేజుఁడై వరుణదేవతాకమైన పశ్చిమదిక్కునందు నస్తమించుచున్నాఁడు.

శ్లో. ఏకక్షితిభృ దుత్పన్నా సచ్ఛిద్రాః కణ్టకోల్బణాః,
మిథ స్సంఘర్షితా వంశా దహ్యన్తే సానుగామినః. ౭౫

వ్యా:—ఏకక్షితిభృదితి. ఏకేన క్షితిభృతా రాజ్ఞా ఉత్పన్నాః జాతాః సచ్ఛిద్రాః మృగయాదిదోషజుష్టాః కంటకైః క్షుద్రశత్రుభిః ఉల్బణాః ప్రచురాః, భూయిష్ఠక్షుద్రశత్రుమంత ఇత్యర్థః. ని. 'సూచ్యగ్రే క్షుద్రశత్రౌ చ రోమహర్షే చ కంటక' ఇత్యమరః. కించ అను పశ్చాత్ గచ్ఛంతీ త్యనుగామినః భృత్యాః తైః సహితాః సానుగామినః వంశా రాజకులాని మిథోఽన్యోన్యం. ని. 'మిథోఽన్యోన్యం రహస్య' పీత్యమరః. సంఘర్షతో వైరా ద్ధేతోః దహ్యంతే నిశ్శేషీక్రియంతే, అంతరంగబహిరంగయో రంతరంగం బలీయ ఇతి భావః.

అన్యోఽప్యర్థః. ఏకక్షితిభృ దుత్పన్నా ఏకపర్వతజాతాః సచ్ఛిద్రాః సరంధ్రాః కంటకోల్బణా స్సూచ్యగ్రయుక్తాః సాను ప్రస్థం గచ్ఛంతీతి సానుగామినః, తత్రస్థా ఇత్యర్థః. వంశాః వేణవః మిథోఽన్యోన్యం సంఘర్షతః సంఘట్టనా ద్ధేతోః దహ్యంతే, అన్యోన్యసంఘర్షణేన వేణవ స్తథా భవంతీ త్యర్థః.

టీ. ఏకక్షితిభృదుత్పన్నాః-ఏక=ఒకఁడైన, క్షితిభృత్ = రాజుచేత, ఉత్పన్నాః=పుట్టినట్టియు, కణ్టకోల్బణాః-కణ్టక=నీచశత్రువులచే, ఉల్బణాః = వ్యాప్తులైనట్టియు, సచ్ఛిద్రాః = వేఁటమొదలగు దోషములతోఁగూడినట్టియు, సానుగామినః = అనుగాములనఁగా భృత్యులు వారితోఁగూడినట్టి, వంశాః=రాజకులములు, అనఁగా రాజవంశమందు పుట్టినవారు, మిథః=ఒకరొకరు, సంఘర్షితాః=కలహించినవారై, దహ్యన్తే= ధ్వంసమగుచున్నారు.

అర్థాంతరము. ఏకక్షితిభృదుత్పన్నాః - ఏక=ఒకటైన, క్షితిభృత్=కొండయందు, ఉత్పన్నాః=పుట్టినట్టియు, సచ్ఛిద్రాః=రంధ్రములతోఁ గూడినట్టియు, కణ్టకోల్బణాః = ముండ్లచే వ్యాప్తములైనట్టియు, సానుగామినః - సాను=కొండయొక్క నమ

భూములను, గామినః = పొందినట్టి, అనఁగా నచ్చటనుండునట్టి, వంశాః=వెదుళ్లు,మిథః =ఒకటికొకటి, సంఘర్షితాః=రాపిడిగలవియై, దహ్యన్తే=కాలిపోవుచున్నవి.

తా. ఒక కొండయం దుత్పన్నములై లోపల రంధ్రములుగలిగి వెలుపల ముండ్లచేవ్యాప్తములై సానువులందుండు వెదుళ్ళొకటికొకటి యొరసికొనుటచేతఁగలిగిన యగ్గివలన నెవ్విధమున కాలిపోవుచున్నవో, అట్లే యొక రాజువలననే గలిగి వేఁట ద్యూతము మొదలగు దోషములుగలవారై మిక్కిలి శత్రువులుగలవారై భృత్యులతోఁగూడియుండు రాజపుత్త్రులు పరస్పరము కలహించినవారై నాశమును బొందుదురు. వెదుళ్లు రాచుకొనుటచే నగ్గిగలుగుట ప్రసిద్ధము. ౭౫

శ్లో. మహాగోత్రేషు సంజాతా మృదవో యేపి తే జనాః,
స్వజీవిత వ్యయేనాపి బహుధాన్యోపకా రిణః. ౭౬

వ్యా.—మహాగోత్రేష్వితి.మహాగోత్రేషు మహాకులేషు సంజాతాః. ని.'గోత్రం నామ్ని కులేఽచల' ఇతి విశ్వః. మృదవః కృపాళవః యే జనా స్సంతి తే జనాః స్వజీవితస్య వ్యయేనాపి స్వయం వినశ్యంత ఇత్యర్థః. అథవా స్వజీవితస్య స్వజీవనహేతుభూతస్య ధనస్య వ్యయే నాపి బహుధా అనేకప్రకారేణ అన్యేభ్యః ఉపకారిణః ఉపకరణశీలా భవంతి. తాచ్ఛీల్యే ణినిః. 'పరోపకార స్సతాం వ్యసన' మితి భావః.

అన్యోఽప్యర్థః. మహాగోత్రేషు మహాశైలేషు వింధ్యాదిషు సంజాతాః మృదవః నఖచ్ఛేద్యాః యే తే జనాః వేణవ స్సంతి. ని. 'వేణుమస్కరతేజనా' ఇత్యమరః. వేణవస్స్వజీవితస్య వ్యయే నాపి, స్వయం ఛేదనం ప్రాప్యాపీ త్యర్థః. బహుధా ఉదవసితాది రూపేణ అన్యేభ్యః ఉపకుర్వంతీతి ఫలితోక్తిః. అథవా బహుభిః ప్రచురైః ధాన్యైః ఉపకుర్వంతి, బహుధాన్యోపకారిణః.

టీ. యేజనాః = ఏమనుష్యులు, మహాగోత్రేషు = గొప్పకులములందు, సంజాతాః=పుట్టినవారుగనుకనే, మృదవః=దయగలవారో, తే=వారు, స్వజీవితవ్యయేనాపి- స్వ=తమయొక్క, జీవిత=జీవనమైనధనాదులయొక్క, వ్యయేనాపి=నాశముచేతనైనను, బహుధా = నానావిధములచేత, అన్యోపకారిణః - అన్య=ఇతరులకు, ఉపకారిణః= ఉపకారముచేయువారు, భవన్తి=అగుచున్నారు.

అర్థాంతరము. మహాగోత్రేషు=గొప్పవియైన వింధ్యము మొదలగుకొండలందు, సంజాతాః=పుట్టినట్టి, మృదవః=లోపలబొంగగుటచే మెత్తఁగనుండు, యే=ఏ, తేజనాః =వెదుళ్లుగలవో, తే=ఆవెదుళ్లు, స్వజీవితవ్యయేనాపి-స్వ=తమయొక్క, జీవిత=బ్రతుకుయొక్క, వ్యయేనాపి=నాశముచేతనైనను, బహుధా=అనేకప్రకారములైన ఇల్లుమొద

లగు రూపముచేత, అన్యోపకారిణి-అన్య=ఇతరులకు, ఉపకారిణి=సహాయముచేయు నవి, భవన్తి=అగుచున్నవి.(అథవా, బహు=అధికమైన, ధాన్య=బియ్యమునొసంగుటచేత, ఉపకారిణి = ఉపకారముచేయునవి, భవంతి=అగుచున్నవి.)

తా. గొప్పవైన వింధ్యాదిపర్వతములందు సంభవించి మెత్తనిస్వభావముగలిగి తమకు మూలభేదముగలిగినను పరులకు ఇండ్లు మొదలగునవికట్టుకొనుటకుఁగాని, అథవా, తమధాన్యమనఁగా వెదురుబియ్యముచేతఁగాని యెట్లుపకారముచేయుచున్నవో, అట్లు గొప్పకులమందు జనించినవారు దయావంతులై తమబ్రతుకునకు హానిగలిగినను దానిని లక్ష్యముంచక అన్యుల కుపకార మనేకవిధములుగా నొనర్చుచున్నారు. వెదుళ్లుపండఁగా నెండిపోవుట ప్రసిద్ధము. అప్పుడు బియ్యము దొరకును.

శ్లో. పరమస్యైవ పుంసస్స్యాన్నిత్యం శ్రీరనపాయినీ,
సారం సదాశయేనేహ సాధుచక్రం బిభర్తి యః. 22

వ్యా.—పరమస్యేతి. యః పురుషః ఇహలోకే సదాశయేన ప్రశస్తాభిప్రాయేణ స్వచ్ఛేనమనసేవేతి యావత్, సారంవరంన్యాయ్యంవా సాధుచక్రం సజ్జనసమూహం బిభర్తి పాలయతి-అస్య ఏతద్గుణవిశిష్టస్య నాన్యస్యైవేత్యేవకారార్థః. పుంసః పురుషస్య శ్రీస్సంపత్ పరమధికం యథాతథా నిత్యం ప్రత్యహం అనపాయినీ అనశ్వరీ స్యాత్ సజ్జనపాలనమేవాఖలశ్రేయో హేతురితిభావః.

అన్యోఽప్యర్థః. యఃవిష్ణుః సదాసారం స్థిరాంశభూతం శ్రేష్ఠంవా.ని.'సారోబలే స్థిరాంశేచ న్యాయ్యేక్లీబంవరేత్రిష్వి'త్యమరః. చక్రం సుదర్శనం శయేన పాణినా. ని. 'పంచశాఖశ్శయఃపాణి' రిత్యమరః. సాధు సమ్యక్ భిభర్తి ధారయతి. తస్య పరమస్యైవ పుంసః పురుషోత్తమస్యైవ శ్రీః రమాదేవీ నిత్యం అనపాయినీ ఆపాయోగస మః, హాన మితియావత్. సోఽస్యా అస్తీతి సా తథోక్తా.

టీ. యః=ఏపురుషుఁడు, ఇహ=ఈలోకమందు, సదాశయేన=మంచియభిప్రాయముచేత, నిర్మలమనస్సుచేననుట, సారం=శ్రేష్ఠమైన,అథవా న్యాయ్యమైన, సాధుచక్రం =సత్పురుషసమూహమును, బిభర్తి=పాలించుచున్నవాఁడో, అస్య=ఇట్టిశ్రేష్ఠుఁడైనట్టి,పుంసఏవ=పురుషునకే, శ్రీః=సంపత్తు, పరం=మిక్కిలి, అనపాయినీ=ఎడబాయకుండునది, స్యాత్=అగును.

అర్థాంతరము. యః=ఏవిష్ణువు, సదా=ఎల్లప్పుఁడు, సారం=శ్రేష్ఠమైనట్టి, చక్రం=చుట్టుకైదువను, శయేన = హస్తముచేత, సాధు=చక్కఁగా, బిభర్తి=ధరించుచున్నాఁడో, తస్య=అట్టి, పరమస్యైవ=శ్రేష్ఠుఁడైనట్టి, పుంసః=పురుషునియొక్క, శ్రీః=లక్ష్మీదేవి, నిత్యం=ఎల్లపుడు, అనపాయినీ=ఎడబాయకుండునదిగా, స్యాత్=అగును.

తా. ఏపురుషుఁడు మంచియభిప్రాయముచేత సాధువులను సంరక్షించుచున్నవాఁడో, అట్టివానియొక్క సంపదయే యెల్లప్పుడు బాయకుండుననియు, శ్రేష్ఠమైనచక్రమును హస్తమందుధరించుచుండు పరమాత్ముఁడైన శ్రీమహావిష్ణువునకెప్పుడు లక్ష్మీదేవి సన్నిహితయై యుండు ననియు భావము.

శ్లో. మృదవోఽపి సదామోద హేతవోఽప్యమలా అపి,
నాతిశ్లాఘ్యా స్సుమనసో జనై ర్జాతివివర్జితాః. ౭౮

వ్యా.—మృదవ ఇతి. మృదవః కృపాళవోఽపి సతాం సజ్జనానాం ఆమోదస్య సంతోషస్య హేతవోఽపి, సజ్జనానందకరా అపీ త్యర్థః. అమలా అపి స్వచ్ఛచిత్తా అపి జాతివివర్జితాః అకులీనా స్సుమనసో విద్వాంసః సజ్జనై ర్నాతిశ్లాఘ్యాః అతీవ నస్తోతవ్యాః. మార్దవాదిగుణవత్తయా ఈషత్ స్తుత్యా ఇత్యర్థః. సకలగుణవిశిష్టా అప్యకులీనాః నశోభంత ఇతి భావః.

అన్యోఽప్యర్థః.మృదవోఽపి కోమలా అపిసదామోదస్య హేతవోఽపిఅమలా అపి నిర్మలా అపి జాతివివర్జితాః మాలతీవ్యతిరిక్తాః సుమనసః పుష్పాణి. ని. 'స్త్రియ స్సుమనసః పుష్పం', 'సుమనా మాలతీ జాతి'రితి చామరః. నాతిశ్లాఘ్యాః అత్యంతం న శ్లాఘనీయాః. పుష్పేషు జాతికుసమస్యైవ ప్రాశస్త్యా దితి భావః.

టీ. మృదవోఽపి = కరుణాశీలులైనను, సదామోదహేతవోఽపి - సత్ = సత్పురుషులయొక్క, ఆమోద = సంతోషమునకు, హేతవోఽపి=కారణములైనను, అమలాఅపి=నిర్మలమైన మనస్సుగలవారైనను, జాతివివర్జితాః=కులీనులుకానియట్టి,సుమనసః = విద్వాంసులు, జనైః = సత్పురుషులచేత, అతిశ్లాఘ్యాః = మిక్కిలిస్తుతింపఁదగినవారు, న=కారు.

అర్థాంతరము. మృదవోఽపి = కోమలములైనను, సదా=ఎల్లపుడు, ఆమోదస్య=పరిమళమునకు, హేతవోఽపి = కారణములైనను, అమలాఅపి = దోషరహితములైనను, జాతివివర్జితాః = జాజులకంటె వేఱైన, సుమనసః=పుష్పములు, అతిశ్లాఘ్యాః =మిక్కిలిపొగడఁదగినవి, న=కావు.

తా. మృదువుగలిగి మంచివాసనచే నలరి స్వచ్ఛములై యుండినను జాజులుకాని పువ్వులెట్లు విశేషశ్లాఘ్యములు కావో, యట్లెయింగుననే దయావంతులై సజ్జనసంతోషకరులై స్వచ్ఛచిత్తులైయుండినను సత్కులమందు పుట్టనివారు హెచ్చుగా పొగడఁదగినవారుకారు. అనఁగా సామాన్యముగా పొగడఁదగుననియు అన్నిగుణములు కలిగియున్నను కులములేనివారు ప్రకాశించరనియు భావము. ౭౮

శ్లో. కుజన్మనా య త్క్రూరేణ పారుష్యం రజసాకృతమ్,
లబ్ధవర్ణస్య నగ్లాని స్సచిత్ర స్యేవ తావతా. ౭౯

వ్యా.—కుజన్మ నేతి. కుజన్మనా అకులీనేన క్రూరేణ పురుషేణ కర్త్రా రజసా రజోగుణేన, అహంకారే ణేతి యావత్. యత్పారుష్యం నైష్ఠుర్యం భర్త్సనాదికృతం ఆకారి గుర్వాదా వితి శేషః. తావతా లబ్ధవర్ణస్య విదుషః న గ్లానిః కథం? సచిత్ర స్యేవ ఆలేఖ్యయు క్తస్య కుడ్యాదే ర్యథా. తస్యాపి కుజన్మనా భూమిజేన రజసా పాంసునా యత్ పారుష్యం ధూసరత్వం మలిన తేతి యావత్ కృతం తావతా ధూసర త్వేన లబ్ధవర్ణస్య లబ్ధః వర్ణః నీలపీతశుక్లాది ర్యస్య తస్య చిత్రస్య గ్లానిః మాలిన్యం న భవతి. యథా చిత్రం జలసేకసాధారణమర్దనాదినా నశ్యతి న తథా పాంసుసంప ర్కేణే త్యర్థః.

టీ. కుజన్మనా=చెడ్డజన్మముగల, అనఁగా కులహీనుఁడైన, క్రూరేణ=క్రూరుఁడైన పురుషునిచేత, రజసా=రజోగుణముచేత, అనఁగా నహంకారముచేత, యత్=ఏ, పారుష్యం = బెదరింపుమొదలైనది, ఆకారి= (గురువు మొదలగువారియందు) చేయఁబడుచున్నదో, తావతా = అంతమాత్రముచేత, లబ్ధవర్ణస్య = విద్వాంసునకు, కుజన్మనా- కు=భూమివలన, జన్మనా=పుట్టినట్టి, క్రూరేణ=కఠినమైన, రజసా=దుమ్ముచేత, యత్=ఏ, పారుష్యం=పరుసదనము, అనఁగామలినత్వము, కృతం=చేయఁబడుచున్నదో, తావతా= అంతమాత్రముచే, లబ్ధవర్ణస్య - లబ్ధ=పొందఁబడిన, వర్ణస్య=నలుపు పసుపు మొదలగు వన్నెలుగల, చిత్రస్యేవ=చిత్రమునకువలెనే, గ్లానిః=మాలిన్యము, నభవతి=కలుగదు.

తా. భూమివలనజనించి పరుసమైనధూళిచేత చక్కఁగా వన్నెపూయఁబడినచిత్రములకు నెవ్విధమున హానిగలుగదో, యవ్విధమునజాతిహీనులై క్రూరులైనవారు గర్వముచేతపెద్దలను దూషించిరేని యంతమాత్రముచేత పెద్దలకెట్టిమాలిన్యమును కలుగనేరదు. చిత్రములు నీరుమొదలగువానిచే చెడినట్లు భూపరాగముచేత చెడదనియు దుర్జనుల తిరస్కారములు సజ్జనులను జెడుపఁజాలదనియు భావము. ౭౯

శ్లో. పార్శ్వే వసంతం కామేషు సాధకం సహకారిణమ్,
దృష్ట్వా పికః పుమా న్హృష్య న్నాలపేన్మధురాజ్గిరమ్. ౮౦

వ్యా.—పార్శ్వ ఇతి. పార్శ్వే సమీపే వసంతం తిష్ఠంతం, స్నేహపాలన వశా దితి భావః. కామేషు అభిలషితార్థేషు సాధకం సంపాదకం కుత స్సహకారిణం సహాయినం ఏవంవిధం పురుషం దృష్ట్వా కః పుమాన్ కోవా పురుషః హృష్యన్ మధు

రాం మనోరమాం గిరం వాచం నాలపేత్. న వదే దితి కాకుః. గుణినం మాద్రియం తే పూజంతే ఇతి భావః.

అన్యోఽప్యర్థః. సహకారిణంఅతిసౌరభచూతకుసుమం. ని. 'సహకారోఽతిసౌరభ' మిత్యమరః. అతఏవ కామేషూణాం మన్మథశరాణాం సాధకం వసంతం కాలం పార్శ్వే దృష్ట్వా చ వసంతకాలధర్మం దృష్ట్వే త్యర్థః. కాల స్యామూర్తత్వా ద్ధర్మేణ కాలో లక్ష్యతే పుమా న్పికః పుంస్కోకిలః హృష్యన్ మధురాం శ్రావ్యాం గిరం నాలపే దితి కాకుః. వసంతకాలేఽపి కో ధ్వనతీతి భావః.

టీ. పార్శ్వే = చెంగట, వసన్తం = ఉండునట్టియు, కామేషు = ఇష్టార్థము లందు, సాధకం=సంపాదకుఁడైనట్టి, సహకారిణం=సహాయకుఁడైన పురుషుని, దృష్ట్వా =చూచి, కఃపుమాన్=ఏపురుషుఁడు, హృష్యన్=సంతసించినవాఁడై, మధురాం=మనోహరమైన, గిరం=మాటను, నాలపేత్ = పలుకఁడా? అనఁగా పలుకుచున్నాఁడనుట. గుణవంతులను పూజింతురని భావము.

అర్థాంతరము. సహకారిణం = తియ్యమామిడిపువ్వు గలది గనుకనే, కామేషు సాధకం - కామ = మన్మథునియొక్క, ఇషు=తూపులకు, సాధకం=సంపాదకమైనట్టి, వసన్తం=ఆమనిని, పార్శ్వే=ప్రక్కయందు, దృష్ట్వా=చూచి, (అనఁగా వసంతకాల ధర్మమును గాంచి యనియర్థము. కాలమునకు మూర్తము లేదుకదా) పుమాన్=పురుష రూపమైన, పికః=కోయిల, హృష్యన్=సంతసించినదియై, మధురాం=ఇంపైన, గిరం= పలుకును, నాలపేత్=పలుకదా?

తా. తనకురంగట మెలంగుచు నిష్టార్థంబులను సంపాదింపఁజేయుచు నెప్పుడు నెడఁబాయకయుండు చెలికానినిగాంచి యెవ్వాఁడైనను తియ్యనిపలుకులు పలుకకుండు నా యని యర్థము. తియ్యనిమామిడిపూలచే నొప్పుచు పచ్చవిల్కానితూపులకు సాధకం బైన యామనిని సమీపంబునఁగాంచి గండుకోయిల మధురముగా రొదసేయకుండునా యనిభావము. ౮౦

శ్లో. దేవాశ్చ భూమిదేవాశ్చ నిత్య మప్యమృతాశనాః,
హీయన్తే స్వాధికారా త్తే యే సేవన్తేన వాసవమ్. ౮౧

వ్యా.—దేవా ఇతి.నిత్యం ప్రత్యహం అమృతం సుధా అశనం అన్నం యేషాం తథోక్తాః యే దేవాః వాసవం ఇంద్రం నసేవంతే న భజంతే, స్వేషాం అధికారాత్ స్వామ్యలక్షణాత్.'అధికారః ఫలస్వామ్య' మితి దశరూపకే. ఫలం రాజ్యాది తస్య స్వామిత్వ మిత్యర్థః. హీయంతే త్యజ్యంతే. 'ఓహాక్ త్యాగ' ఇత్యస్మాద్ధాతోః కర్మకర్తరి

లక్ప్రాపం. ఇంద్రః స్వసేవకాన్ సురా నధికారా చ్చ్యావయతీ త్యర్థః. భూమిదేవాః బ్రాహ్మణాః నిత్యం ప్రత్యహం అమృతం యజ్ఞశేషం అశ్నంతి భుంజత ఇతి తే తథోక్తా అపి అథవా అమృతం అయాచితం యథాతథా అశ్నంతీతి తే తథోక్తాః అథవా అమృతాశనాః జలాహారా అపి. ని. 'అమృతం వ్యోమ్ని దేవా న్నే యజ్ఞశేష రసాయనే, అయాచితే జల' ఇతి శబ్దార్ణవే. యేనవాసవం నూతనమద్యం సేవంతే పిబంతి. నవశబ్దో౽త్రాతంత్రః, అథవా సంస్కృతం తే బ్రాహ్మణాః స్వేషాం అధికారాత్ కర్మయోగ్యతా లక్షణాత్ హీయంతే,కర్మా నధికారిణో భవంతీత్యర్థః. 'నిత్యం మద్యం బ్రాహ్మణో వర్జయే' దితి గౌతమస్మరణా దితి భావః.

టీ. నిత్యం = ఎల్లపుడు, అమృతాశనాః-అమృత = పాలు, అశనాః = అన్నముగాఁగల, యేదేవాః = ఏదేవతలు, వాసవం = ఇంద్రుని, నసేవంతే=కొలువరో, తే =ఆదేవతలు, స్వాధికారాత్ - స్వ=తమయొక్క, అధికారాత్ =స్వామిత్వము వలననుండి, హీయన్తే=విడువఁబడుచున్నారు.

అర్థాంతరము. యే భూమిదేవాః = ఏబ్రాహ్మణులు, నిత్యం = ఎల్లపుడు, అమృతాశనా అపి-అమృత=యజ్ఞశేషము, అథవా=అయాచిత పదార్థము, లేక జలము, అశనా అపి = అన్నముగాఁగలవారైనను, "శ్లో. అమృతం యజ్ఞశేషంబు సుధా మోక్షేష్వయాచితే, అన్న కాంచనయో ర్జగ్ధౌ ఖేస్వాదుని రసాయనే, ఘృతే వ్యాద్యే గోరసేచ" అని హేమచంద్రుఁడు. నవాసవం-నవ=క్రొత్తయైన, ఆసవం=కల్లును, సేవంతే=త్రాగుచున్నారో, తే=అబ్రాహ్మణులు, స్వాధికారాత్-స్వ=తమయొక్క, అధికారాత్=కర్మవలననుండి, హీయన్తే=తక్కువగుచున్నారు.

తా. అమృతమే యన్నముగాఁగలదేవతలు తమకు ఏలికయైన యింద్రుని సేవింపకయుండిరేని వారివారి యధికారమువలననుండి బహిష్కృతు లగుదురు. యజ్ఞశేషముగాను, అయాచితమైనదియుఁను, నీరును అన్నముగాఁగల బ్రాహ్మణులు కల్లుత్రాగుదురేని కర్మభ్రష్టు లగుదురు.

శ్లో. అశేషచక్షుశ్శ్రవణప్రతికూలో భవ న్నపి,
వినతానన్ద హేతు ర్యస్స పుమా నాప్తనన్దకః. ౨౨

వ్యా.—అశేషేతి. యః పురుషః అశేషాణాం అఖిలానాం చక్షుశ్చ శ్రవణం చ చక్షుశ్శ్రవణం ప్రాణ్యంగత్వా దేకవద్భావః. తస్య ప్రతికూలో భవ న్నపి దౌర్జన్య లక్షణా ద్ద్రష్టుం శ్రోతుం చా ప్యనిష్ట పీత్యర్థః. వినతాః వినయినః, సజ్జనా ఇతి యావత్. తేషాం ఆనందస్య హేతుః ఆనందకరశ్చేత్ స పుమాన్ పురుషః ఆప్తాన్ సజ్జ

